ప్రిట్, డి. యన్.

సోవియెట్ సంయుక్త రాష్ట్రం - మన మిత్రరాజ్యం

మద్రాసు, 1943

Record no. 114

Priṭ, Ḍi. Yan.

Sōviyeṭ saṃyukta rāṣṭraṃ - mana mitrarājyaṃ

Madrāsu, 1943

Record no. 114

## Bibliographic Record Target

ప్రిట్, డి. యన్.

సోవియెట్ సంయుక్త రాష్ట్రం - మన మిత్రరాజ్యం / రచన డి. యన్. ప్రిట్, అనుసరణ సామ్యవాది. - మద్రాసు : సంస్కృతి గ్రంథమండలి, 1943.

54, (2) p. ;17 cm.

Record no. 114

Priṭ, Ḍi. Yan.

Sōviyeṭ saṃyukta rāṣṭram - mana mitrarājyaṃ / racana Ḍi. Yan. Priṭ, anusaraṇa sāmyavādi. - Madrāsu : Saṃskṛti Granthamaṇḍali, 1943.

54, (2) p. ;17 cm.

Record no. 114

# సోవియట్ సంయుక్తరాష్ట్రం-

## మన మిత్రరాజ్యం



ప్రతి గ్రంథమండలి
మద్రాసు

## ఇందులో —



## మా ప్రచురణలు



# సోవియట్ సంయుక్తరాష్ట్రం -

## మన మిత్రరాజ్యం


రచన:

**డి. యన్. ప్రిట్. కె. సి., యం. పి.,**

అనుసరణ:

**సామ్యవాది**



## సంస్కృతి గ్రంథమండలి

పంగల్ బిల్డింగ్స్ :: పెరంబూరు పోస్టు

## మద్రాసు

ప్రచురణ—8
వెల ఎనిమిదణాలు

ప్రథమ ముద్రణం
సెప్టెంబరు 1943

సంపాదకులు :

కస్తూరి సూర్యప్రకాశరావు,

కొత్తపల్లి సుబ్బరామయ్య, ఎం. ఏ., ఎల్. టి.,

మేనేజరు :

వంగల్ గోవిందస్వామి రెడ్డి



# 1. సోవియట్ చరిత్ర

1917 నవంబరు 7 వ తారీకున జరిగిన విప్లవంనుంచి నేటివరకు గడచిన 25 ఏండ్ల సోవియట్ చరిత్రను మూడు యుగముల క్రింద విభజింపవచ్చు - (1) యుద్ధకాలపు (1917—21) కమ్యూనిజం, (2) నూతన ఆర్థిక విధానం, (3) నిర్ణీత ఆర్థిక విధానం.

## యుద్ధకాలపు కమ్యూనిజం

మొదటి యుగంలో సోవియట్ రాష్ట్రం ప్రాణాన్ని దక్కించుకొను హోరాహోరి పోరాడవలసి వచ్చింది. ఈ పోరాటం 1921 వరకు సాగింది. బోల్షివిక్కులు 1917 లో దేశమును వశపరచుకొనినప్పుడు 1914 లో ప్రారంభమైన యుద్ధ ఫలితంగా దేశం నిర్వీర్యమైయుండిపోయింది. పరిశ్రమలు ధ్వంసమైనవి. ఎల్లప్పుడూ వెనుకబడియున్న వ్యవసాయం ఆ యుద్ధపు రోజుల్లో పూర్తిగా పాడైంది. 1918 మార్చిలో జరిగిన బ్రెస్టలిటొవ్స్క సంధిమూలంగా బోల్షివిక్కులు జర్మనీకి శరణాగతులై జర్మనీనుండి తప్పించుకొన్ననూ "అంతర్యుద్ధం," "జోక్యం" వారిని వదలినవి కావు. పెట్టుబడిదారి ప్రభుత్వాలన్నీ ఏకమై ఒక్క పెట్టున, విప్లవద్రోహులైన తెల్ల రష్యనులు, డెనికిన్, రంగెల్, యుడెనిచ్, కోల్చక్ మొదలైనవారి సహాయంతో గొప్ప యెత్తున దండెత్తడాన్నే "అంతర్యుద్ధం" "జోక్యం" అని అంటారు. ఈ విరోధుల నెదుర్కొనను ఎర్ర సైన్యాన్ని నిర్మించి, ఆ సైన్యాన్ని పోషించనూ, ఆ సైన్యానికి కావలసిన సామగ్రిని సరఫరా చేయనూ "యుద్ధకాలపు కమ్యూనిజం"ను అవలంబించారు. ఈ నూతన విధానానికి ఫలితంగా పరిశ్రమ లన్నింటినీ రాష్ట్రం వశపరచుకొన్నది. రైతులు పండించిన పంటల్లో వారి అక్కరలకు పోగా మిగిలిన ధాన్యమంతా రాష్ట్రం వశపరచుకునేది.

## నూతన ఆర్థిక విధానం

విప్లవ ద్రోహులను, పెట్టుబడిదారి సైన్యాలను ఎదుర్కొనుట సామాన్య విషయంగాదు. ఈ మహత్తర కార్యం 1921 కి ముగిసినది కాని వ్లాడివోస్టక్ లోని జపాన్ సైన్యాలు 1922 వరకు అచటినుండి తరిమివేయ బడలేదు.

విదేశ ప్రభుత్వాల బారినుండి, తాత్కాలికంగా, రక్షించిన పిదప ఈ నూతన రాష్ట్రాన్ని స్థిమితతకు, అభివృద్ధికి తెచ్చుట చాల కష్టమైంది. జారులనాటి రష్యా ఉత్పత్తిలో చాల వెనుకబడియున్న దేశము. అట్లయ్యి 1921 లో సోవియట్ల ఉత్పత్తి శక్తి 1913 లోని ఉత్పత్తిశక్తిలో ఐదోవంతు మాత్రమే ఉండింది. ఉత్పత్తి నభివృద్ధి చేయను లెనిన్ 1921 లో యుద్ధకాలపు కమ్యూనిజంనుంచి ఒక అడుగు - ఆర్థికంగా - వెనుకకు వేసినాడు. 1921 లో "నూతన ఆర్థిక విధానం" ప్రవేశపెట్టబడినది. వ్యక్తిగతంగా వ్యాపారం సాగించను కొంత అవకాశం కల్గింది. కాని భూమి, బాంకులు, విదేశవ్యాపారం, భార పరిశ్రమలు, రైలు మార్గాలు ప్రజలచేతుల్లోనే ఉండిపోయినవి.

త్వరలోనే అభివృద్ధి అగుపడినది. 1924-25 లో, 1913 తో పోల్చిన, వ్యవసాయ ఫలితం 87% కు, పారిశ్రామిక ఫలితం 75% హెచ్చింది. బోల్షివిక్కులు ఇంతటితో తృప్తిచెందలేదు. విప్లవానికి పూర్వం అతి హీనజీవిత పరిమాణాన్ని గల్గిన తమదేశం అభివృద్ధి చెందవలెనని, తమ ప్రజలు సౌఖ్య మనుభవించవలెనని కోరారు. తమదేశం ఏ క్షణమందైనా పెట్టుబడిదారి సైన్యాలచే దండెత్తబడవచ్చును గనుక అట్టి విపత్తునుండి రక్షించుకొనుటకై తగిన బలాన్ని, శక్తిని సంపాదించ పూనుకున్నారు. "అంతటిబలం మన దేశాని కెలాకల్గుతుంది ?" అని వారూహించారు. ఇందుకు మార్గాలు రెంటిని కనిపెట్టారు - (1) సంపూర్ణ సామ్యవాద ఆర్థిక విధానాన్ని స్థాపించడం, (2) గొప్ప యెత్తువ పరిశ్రమల నభివృద్ధిపరచడం, పెట్టుబడిదారి విధానంతో రాజకీయ యుద్ధాలను జయించగల్గారు గాని ఆర్థిక పోరాటాలను గెలవడం అంత సులభంకాదు. అందుకు తమ రాష్ట్రాన్ని వ్యావసాయక రాష్ట్రంనుండి పారిశ్రామిక రాష్ట్రంలోకి మార్చడం అత్యవసరం. తమ దేశాన్ని వ్యావసాయక దేశంగానే ఉంచవలెనన్న ట్రాట్స్కీ భావాల ననుసరించియున్న సోవియట్లు ఎన్నడైనా పెట్టుబడిదారి సైన్యాలకు లొంగవలసియుండేది: ఎర్రసైన్యాన్ని బలపరచడం, దానికి కావలసిన సామగ్రిని సరఫరా చేయడం అసాధ్యమయ్యేది. అందువలన 1926–1929 ల మధ్యకాలంలో, విదేశీల పెట్టుబడితో నిమిత్తం లేకుండా నూతన భార పరిశ్రమలను - యంత్రోత్పత్తి, ఇమప కర్మాగారాలు, ఉక్కు పరిశ్రమ, యుద్ధసామగ్రిని ఉత్పత్తిచేయు కర్మాగారాలు మొదాలైనవి - సామ్యవాద పునాదులపై నెలకొల్పారు. ఈ పరిశ్రమ లభి-



వృద్ధి చెందుచున్నప్పుడు వ్యవసాయం పూర్వపు దుస్థితిలో నుండుటకు వీలులేదు. "కొద్దిపాటి క్షేత్రాలు పేదరికమునుండి తప్పించుకొనే మార్గాలు లేవు" అన్నాడు లెనిన్. అందు చేతనే సమిష్టి వ్యవసాయ పద్ధతి ఆరంభింప బడింది. తద్వారా వ్యవసాయముగూడ పరిశ్రమలతోపాటు "నిర్ణీత ఆర్థిక విధానం"లో ఒక భాగమైంది: పంచవర్ష ప్రణాళికలో చేర్చబడింది.

## నిర్ణీత ఆర్థిక విధానం

ప్రథమ పంచవర్ష ప్రణాళిక 1–10–1928 నుంచి 31–12–1932 వరకూ సాగింది. ఐదేండ్లకని అంచనా వేయబడిన ఈ కార్యక్రమం 4½ సంవత్సరాల లోనే ముగింపబడింది. ఈ ప్రణాళిక నమలునందుంచడం మూలాన భారపరిశ్రమలు, సమిష్టి వ్యవసాయం అభివృద్ధిచెంది సామ్యవాదస్థాపనకు తగిన ఆర్థిక పునాదులను ఏర్పాటు చేసినవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక 1-1-1933 నుంచి 31-3-1937 వరకు అమలునం దున్నది. ఈ ప్రణాళిక దేశంయొక్క సాంకేతిక పునర్నిర్మాణాన్ని పూర్తిచేసి జీవిత పరిస్థితులను అపారంగా అభివృద్ధి పరచింది.

ఈ ప్రణాళికల మూలంగా ప్రజలెన్నో కష్ట, నష్టాలను పడవలసివచ్చింది. భార పరిశ్రమల నిర్మాణకాలంలో మిగత పరిశ్రమలన్నీ ఎదో ఒక విధంగా అందుకు తోడ్పడినందున కొనుగోలు వస్తూత్పత్తి తగ్గింది. ప్రజలు అనేకవస్తువులు చాలక, కొన్ని వస్తువులు లేక బాధపడవలసి వచ్చింది. సోవియట్ ప్రజలు సహనంతో ఈ కష్టాలన్నిటినీ ఓర్చి తమ నూతన సృష్టిని నిర్వహించగలిగారు. పెట్టుబడిదారి ప్రపంచం ఈ పంచవర్ష ప్రణాళికలు విఫలమైనవని ఎంత ప్రచారం సాగించినా కడకు సోవియట్లు జయము పొందినందున ఒక గొప్ప నూతన పారిశ్రామిక రాష్ట్రం ఏర్పడింది. ఈ యుద్ధపు రోజులలో సోవియట్లు తమ పారిశ్రామిక శక్తిని హెచ్చుగా తమ దేశరక్షణకై ఉపయోగింప గల్గినందున ఈ పంచవర్ష ప్రణాళికలు పొందిన దిగ్విజయం ద్విగుణీకృత మైంది.

తృతీయ పంచవర్ష ప్రణాళిక 1938 నుంచి 1942 వరకు సాగియుండేది. జర్మనులు సోవియట్లపై దండెత్తకపూర్వం ఈ ప్రణాళిక కార్యక్రమం సాగిన

రీతినిబట్టి ఈ ప్రణాళికకూడ ఎంతో జయప్రదంగా సాగిందనే అనాలి. ఈ ప్రణాళిక పూర్తి అయియున్న ఉత్పత్తి శక్తిలో సోవియట్లు పెట్టుబడిదారి ప్రపంచాన్ని మించిపోయేవి. "ప్రతివానినుంచి వాని శక్తికొలదిన్నీ, ప్రతివానికి వానిశ్రమను బట్టిన్నీ" అన్న సామ్యవాద విధానంనుంచి "ప్రతివానినుంచి వాని శక్తికొలది, ప్రతివానికి వాని అవసరాన్నిబట్టీ" అన్న కమ్యూనిస్ట్ విధానానికి సోవియట్లు అంజవేసి సాగగలిగినవి. కమ్యూనిజం ఒక సాంఘికావస్థ. అట్టి సంఘంలో ప్రతి ఒక్కరి అవసరాలను, అక్కరలను తృప్తిపరచ తగినంత ఉత్పత్తి చేయబడును. ప్రజలు "లేమిడి" అన్న భయంనుండి విడుదల అవుతారు. ఏ వస్తువును దోచుకుందామనిగాని, దాచిపెట్టుకొందామనిగాని వారు అనుకోరు, వస్తుసామగ్రి అపారంగా సరఫరా కావడమే ఇందుకు కారణం. సంఘోత్పత్తినుండి ఏ వ్యక్తి తనకెంతకావలయునన్నా తీసుకోడానికి వీలుంటుంది. సామ్యవాదావస్థలో వ్యక్తి కోర్కెలు సంపూర్ణంగా తృప్తిపరుపబడడంలేదు. తన శ్రమ శక్తితో సంపాదించిన డబ్బుపెట్టి వ్యక్తి తనకు కావలసిన వస్తు - వసతులను కొనుక్కుంటున్నాడు. ముసలివాడుగాగాని, కష్టించలేని వాడుగాగాని ఉన్న, తాను ప్రభుత్వంనుండి పొందు భరణంతో వస్తు - వసతుల కొంటున్నాడు. బోల్టువిక్కులు శాస్త్రీయ సామ్యవాదులు గనుక తమదేశం, సకాలంలో ప్రపంచమంతయుగూడ, సామ్యవాదంనుంచి కమ్యూనిజంలోకి మారుతుందని ఎల్లప్పుడు విశ్వసించుచునే యున్నారు. కాని, విప్లవానంతరం 20 ఏండ్లలోనే కమ్యూనిజాన్ని అమలునందుంచ ప్రయత్నించడం - ఆ విషయాన్ని కేవలం చర్చించడంగాని - సోవియట్ల మహత్తర అభివృద్ధిని చాటుచున్నది.

## సంఘాభివృద్ధి

ఈ పారిశ్రామిక నిర్ణయంతోబోటు సంఘ అభివృద్ధి కార్యక్రమంగూడా అమలునందుంచబడినది. ఉచిత వైద్యసేవ, ఉచితవిద్య, సెలవు రోజులకుగూడ జీతము, ఉదారమైన భరణాలు, మితమైన బాడుగలు, నిరుద్యోగ నిర్మూలనం - ఇవన్నీ ఆర్థిక వ్యాకులతను తొలగించినవి. రైతు - శ్రామికుల జీవితాలను పూర్తిగా మార్పుచేసినవి. "సంస్కృతి" - ఈ పదమునకుగల తక్కువ అర్థంలో - నాటకం, సాహిత్యం, సంగీతం, విజ్ఞానం మూలంగా ప్రజాభాహుళ్యాన్ని



నూతన ప్రపంచంలోనికి తీసుకొని వెళ్ళినది. ఇందుకు రాష్ట్రంచేసిన అపారద్రవ్య సహాయం, విద్య తోడ్పడినవి. ఈ మహత్తర మార్పునకు రాజకీయ పునాది "సోవియట్లు" విధానమే.

"సోవియట్" అన్నపదానికర్థం సలహా సంఘమని. ఈ సంఘాలు శ్రామికులచే ఎన్నుకొనబడి, వారికి బాధ్యులై ఉన్నవి. "వంట ఇంటపనిచేసే ప్రతి పడుచుగూడా దేశాన్ని పరిపాలించగల నిపుణతను పొందాలి" అన్నాడు లెనిన్. సోవియట్లందుకు ప్రయత్నించినవి. ఆదినుంచి ఈ సంఘాలు ప్రభుత్వశాఖలుగా నుండి ఫాక్టరీ సోవియట్లు, వ్యవసాయక్షేత్ర సోవియట్లు, గ్రామ సోవియట్లన్న విశాలపునాదిమీద ఏర్పడి, పైకి పోను పోను గోపురంవలె సన్నగిలి, మాస్కోలోని ప్రజామంత్రి సమితితో పూర్తిచెందినవి. 1922 నుంచి సోవియట్లను "సంయుక్త రాష్ట్రం" అని పిలుచుచున్నారు. 1922 లో రష్యను, ట్రాన్సకేషియను, యుక్రేనియను, బైలో రష్యను సోవియట్ ప్రజాస్వామ్యాలు ఒక ఫెడరేషనుగా చేరినవి. 1940 కి వీటి సంఖ్య పెరిగినది. 16 "సంయుక్తరాష్ట్ర" ప్రజాస్వామ్యాలు ఇందులో చేరినవి. ప్రతి సంయుక్తరాష్ట్రంలోనూ అనేక జిల్లాలు, అనేక ప్రాంతాలు వాటి వాటి స్థానిక స్వపరిపాలనా విధానాన్ని కలిగివున్నవి.

## జాతీయ అల్ప సంఖ్యాకులు

సోవియట్ సంయుక్త రాష్ట్రంలో అనేక జాతుల ప్రజలు నివసించుచున్నారు గనుక వారి స్వపరిపాలనను, వారి జాతీయ సంస్కృతిని, వారి భాషను ప్రభుత్వం గుర్తించుచున్నది. జారుల కాలంలో రష్యను జాతికి చెందని ప్రజలు - జారు సామ్రాజ్యంలోని మొత్తం జనాభాలో వీరి సంఖ్య సగముండేది - "వలస రాజ్యాల" ప్రజలుగా పరిపాలింపబడేవారు. వారు పరిశ్రమలను అభివృద్ధిపరచను వీలులేదు. చదువుకొనుటకైన తమ మాతృభాష నుపయోగింప వీలులేదు. వారి జీవితవ్యయం చాల కొద్దిగా నుండేది. వారి నికృష్టదశనుబట్టి జారుల సామ్రాజ్యాన్ని "జాతుల బంధిఖానా" అని పిలిచేవారు. జాతులను హింసించడం సామ్యవాదపద్ధతిగాదు. జాతులను హింసించుచున్న ఏ రాష్ట్రంగాని సామ్యవాద రాష్ట్రంగా విరోధియైన పెట్టుబడిదారి ప్రపంచం నడుమ నిలిచియుండజాలదు. అల్ప సంఖ్యాక

జాతియైన జార్జియాకు చెందిన స్టాలిన్ ఈ నానాజాతుల ప్రజలను సంపూర్ణ సమానత్వాన ఉంచను, వారిని "రూపంలో జాతీయంగాను, ఉత్సాహంలో సామ్యవాదులుగాను" మార్చను, ప్రస్తుతం "జాతీయ అల్పసంఖ్యాకులు" అని పిలువబడువారినుండిమాత్రమేగాక ఇతర ప్రజలనుండిగూడ సోవియట్ రాష్ట్రానికి బలం సంపాదించను ఎంతో పాటుపడినాడు. 1936 లో అమలులోనికి వచ్చిన నూతన నిర్మాణ చట్టంలోని 123 వ నిబంధన ననుసరించి జాతి, కుల భేదంలేకుండా ప్రజలందరికీ సమానహక్కులున్నవి. కేవలం చట్టరీత్యా మాత్రమేగాక వారి భూములను ఆర్థికంగా అభివృద్ధిపరచడంవలన అనుభవంలోగూడ సమాన హక్కు లేర్పడినవి. టడ్జికిస్థాన్, యూక్రేన్లలో వ్యవసాయం సమిష్టి పరచబడినది. కామ్ఛట్కాలోని చేపలుపట్టే వృత్తులు సమిష్టి పరచబడినవి. ఉత్తరాననున్న ఉన్ని పరిశ్రమను గూడ సమిష్టి పరచినారు. ఉజ్బెకిస్థాన్కు నీటి వసతిని కల్గించారు. అచ్చట పండే వత్తిని బట్టగా నేయను మిల్లులను నిర్మించారు. సోవియట్ సంయుక్తరాష్ట్ర ప్రజలందరు తమ ప్రభుత్వంలో భాగస్వాములుగా నున్నారు. కేవలం తమ నివాసస్థలాలనుండి తమ ప్రతినిధుల నెన్నుకొనుట, ఆ ప్రతినిధులు సక్రమంగా పని చేయనప్పుడు వారిని తొలగించుటమాత్రమేగాక వారు తమ గ్రామ, ప్రాంత, ప్రజాస్వామ్య, సంయుక్తరాష్ట్ర సోవియట్లకు ప్రతినిధుల నెన్నుకొనుచున్నారు. పైగా, సుప్రసిద్ధ సోవియట్లోని రెండు శాసన సభలలో నొకటియైన "జాతుల సోవియట్"కూ తమ ప్రతినిధుల నెన్నుకొనుచున్నారు. ఈ జాతుల సోవియట్ను, నిర్మించడానికి కారణం 58% జనాభాగల రష్యనులు, 42% రష్యనేతరులతో ఐర్లండు, భారతదేశంలోవలె అల్పసంఖ్యాకుల సమస్యను రేకెత్తించకుండా ఉండవలనన్న ఉద్దేశమే.

ప్రస్తుతం సోవియట్ సంయుక్తరాష్ట్రం అని పిలువబడు దేశచరిత్ర 25 ఏండ్ల నిర్మాణాన్ని తెల్పుచున్నది. ఈ దేశం 1922 వరకు స్వయంరక్షణకై పోరాడవలసి వచ్చినందుననూ, 1938-39 లో జపాన్తో ఘర్షణ కలిగినందుననూ, 1941 నుంచి నాజీ జర్మనీ దండయాత్ర నెదుర్కొనవలసి వచ్చినందుననూ ఈ నిర్మాణ కార్యక్రమానికి ఆటంకము కలిగినది. దేశంలోని పంచమదళాన్ని, క్విస్లింగ్ల రూపు మాపను శ్రమపడవలసి వచ్చినది. (వివరములకు 3 వ అధ్యాయం చూడవగును.) 1921 వరకు తాము జోక్యం పుచ్చుకొనికూడ సోవియట్లదేశం స్థిరపడినందున పెట్టుబడిదారి దేశాలు ఎలాగైనా సోవియట్లను నాశనం చేయవలయునన్న తలంపుతో పంచమదళాన్ని సోవియట్లలో సృజింప నారంభించారు. ప్రపంచంలోని దేశాలన్నిటికన్నా ముందు సోవియట్లే పంచమదళాన్ని రూపుమాపినవి. అందువలననే నాజీలను సోవియట్లు నేడు సాహసంతోను, ధైర్యంతోను ఎదుర్కొన గల్గుచున్నవి.



వెనుకబడియున్న వ్యావసాయక దేశముగా నుండిన జారులనాటి రష్యా, లంచగొండ్లు, అవినీతిపరులైన ఉద్యోగులచే నిరంకుశంగా పరిపాలింపబడుచూ వచ్చిన రష్యా ఈ 25 ఏండ్లలో ఆధునిక పారిశ్రామిక దేశంగాను, అత్యంత అభివృద్ధిని చెందిన వ్యవసాయక దేశంగాను మార్పుచెందినది. నూతన సోవియట్ మేధావులును, వైజ్ఞానికులును, కళోపాసకులును, పారిశ్రామికులును, రైతులును దేశానికి మార్గదర్శకులైనారు. పరిశ్రమలు అపారంగాపెరిగినవి : గొప్పగా సాగింపబడుచున్నవి. పరిశ్రమలను ప్రజలు సమర్థతతో నడిపించుచున్నారు. పరిశ్రమలు అన్ని ప్రాంతములను వ్యాపించి వున్నవి. వ్యవసాయం సమిష్టి పద్ధతికి తీసుకొనిరాబడినది. వ్యవసాయానికికూడ యంత్రసామగ్రి ఉపయోగింపబడుచున్నది. వ్యవసాయంయొక్క సమర్థత, శక్తి 1,000 రెట్లు పెరిగినది. మహత్తర శక్తిగల ఎర్ర సైన్యం నిర్మింప బడింది. ఇంతదనుక రోగిష్టులును, నిరక్షరాస్యులును అయిన ప్రజలు నేడు ఆరోగ్యవంతులును, అక్షరాస్యులును అయినారు. ప్రస్తుతం తామెందుకు పోరాడుచున్నది గ్రహించగల్గుచున్నారు.

# 2. సోవియట్ విదేశాంగ విధానం

ఈ అధ్యాయంలో సోవియట్ విదేశాంగ విధాన చరిత్రను క్లుప్తంగా వర్ణించుతాను. సోవియట్లు - జర్మనీ, బ్రిటను దేశాలతో గల సంబంధాలలోని ప్రత్యేక సమస్యలను, ప్రస్తుత యుద్ధంపట్ల సోవియట్ల వైఖరిని రానున్న ప్రకరణాలలో విశదీకరిస్తాను.

## శాంతి శాసనం

ఈ ఘట్టం రష్యాలో విప్లవం సఫలతనొందిన మరునాడు (8-11-1917 న) సోవియట్ ప్రభుత్వం ప్రకటించిన "శాంతి శాసనం"తో ప్రారంభింపవచ్చు.

ఈ శాసనాన్ని సోవియట్ ప్రభుత్వం ప్రకటించినప్పుడు ప్రపంచమంతా అప్పటికి మూడేండ్లుగా సాగుచున్న యుద్ధంలో మునిగియుండేది. యుద్ధం అంతటితో ఆగింది కాదు. మరో సంవత్సరం సాగిందిగూడాను.

> "యుద్ధంలో మునిగున్న ప్రజలందరికీ, వారి ప్రభుత్వాలన్నిటికీ న్యాయమైన, ప్రజాస్వామ్య శాంతిని నెలకొల్పను వెంటనే రాయబారాలు ప్రారంభింప బడాలి........ఆక్రమణలు కూడదు.........ఒకరి నష్టాన్ని మరొక రచ్చుకోడం కూడదు........

అని ఈ శాసనం ప్రకటించింది. తన 25 ఏండ్ల చరిత్రలో సోవియట్‌రాష్ట్రం శాంతి కొరకై, కేవలం తన నిమిత్తం మాత్రమేగాక, అన్ని దేశాల ప్రజలకొరకైగూడ పోరాడినది. ప్రపంచ ప్రజలక్షేమం యుద్ధంవల్ల లభింపదని, సమకూరదని అతి విషాదకరమైన అనుభవాన్నుండి సోవియట్ సంయుక్తరాష్ట్రం గ్రహించింది, తన పునర్నిర్మాణ ప్రయత్నాలకు యుద్ధం ప్రతిబంధక మౌతుందనిగూడ తెలుసుకున్నది.

## యూరప్ శాంతిని కోరలేదు

సోవియట్ల శాంతి ప్రయత్నాన్ని పెట్టుబడిదారి ప్రపంచం త్రోసిపుచ్చింది. కాని, ఈ ప్రయత్న ఫలితంగా విల్‌సన్ అధ్యక్షుడు తన "పదునాల్గు షరతులు" ఉపపాదించాడు. తర్వాత ఒక సంవత్సరం వరకు ప్రపంచమంతటా సరబలి సాగింది. తర్వాత నాలుగేండ్లపర్యంతం సోవియట్‌రాష్ట్రం (గడచిన ప్రకరణంలో చెప్పబడినట్లు) అంతర్యుద్ధానికి, జోక్యానికి గురి అయింది. ఈ సమయంలో సోవియటు సంయుక్తరాష్ట్రం అవలంబించిన విధానం, సహజంగా, తనపైకి ఎదిరి వచ్చిన వారిని తరిమివేయడానికీ, తాను జీవించియుండడానికీ తనకుగల హక్కును, క్రమేణా, ఇతర రాష్ట్రాలు గుర్తించేటట్లు చేయడానికి ప్రయత్నించడమే. 1921 లో పర్షియా (ఇరాన్), అఫ్గనిస్థాన్, టర్కీలతోను, 1924 లో చైనాతోను సంధి చేసుకున్నది. ఈ సంధులన్నిటిలోను 1917 శాంతి శాసనంలో ఉపపాదింప బడిన సిద్ధాంతాలు ఆచరణలోనికి తీసుకురాబడినవి. 1921 లో సోవియటు రాష్ట్రాన్ని "రష్యన్ సోవియటు ఫెడరేటెడ్ సామ్యవాద ప్రజాస్వామ్యం" అని పిలిచేవారు. అప్పటివరకు జారు ప్రభువులచే హింసింపబడుచుండిన పర్షియాతో 26-2-1921 న



సోవియటురాష్ట్రం సంధి చేసుకున్నది. ఈ సంధిలోని ప్రథమ షరతులో ఈ మాటలున్నవి —

> "పర్షియా ప్రజలు స్వతంత్రులైయుండి, సౌఖ్యంగానుండి, తమ ఆస్తిని తమ ఇష్టానుసారం అనుభవించడం చూడవలయునన్న కోర్కెతో రష్యను సోవియటు ప్రభుత్వం, పూర్వం జారుల ప్రభుత్వం పర్షియా ప్రజలతో చేసుకున్న అమానుష సంధులు, ఒడంబడికలు, ఆచారాలు, అలవాట్లు అన్నింటినీ రద్దుపరచుచున్నది."

9 వ నిబంధనలో వివరింపబడినట్లు —

> "వలసరాజ్యవిధానం, పెట్టుబడిదారి విధానం ఫలితంగా అనేకకష్టనష్టాలు గలుగడమే గాకుండా అపార రక్తప్రవాహంకూడా కల్గింది."

అన్న భావము, పాత అలవాట్లను నిరాకరించవలెనన్న కోర్కె తూర్పుదేశాలతో చేసుకున్న సంధులన్నిటిలోను, దేశంలోని అల్ప సంఖ్యాక సమస్యను పరిష్కరించడంలోను స్పష్టమౌతున్నవి.

## యుద్ధం అనవసరం

ఆయుధ విసర్జన, శాంతిప్రయత్నాలపట్ల ధృఢమైన, సత్యమైన మార్గాన్ని అవలంబించను తగిన ఉన్నతస్థితిలోనున్నది సోవియటు సంయుక్తరాష్ట్రం. తన ఆర్థికవిధానంయొక్క స్వభావాన్నిబట్టి, పెట్టుబడిదారి దేశాలవలె, తాను ఇతర రాష్ట్రాలతో పై పోటీచేసి వలసరాజ్యాలనూ, బజార్లనూ, పెట్టుబడి బెట్టతగిన దేశాలనూ సంపాదించవలసిన అవసరం సోవియటు సంయుక్తరాష్ట్రానికి లేదు. తద్వారా తన ఆర్థిక యంత్రాన్ని విచ్ఛిన్నం కాకుండా నిలబెట్టవలసిన దుస్థితి లేదు. యుద్ధసామగ్రి నుత్పత్తి చేయడంలో తాను పెట్టుబడిదారి దేశాలతో పై పోటీకి దిగిన, పెట్టుబడిదారి దేశాలలోవలె కొద్దిమంది వ్యక్తులకు అపరిమిత లాభాలు దొరకడానికి బదులు, తన ప్రజలందరి జీవిత బత్తెం తగ్గుతుందని సోవియట్ రాష్ట్రం తెలిసికొన్నది. అందువలననే 1920 నుంచి చేయబడిన శాంతి ప్రయత్నము లన్నిటికీ మనస్ఫూర్తిగా దోహదమిచ్చింది. "యుద్ధం అన్యాయం" అని ప్రకటించిన కెల్లాంగ్ ఒడంబడికను మిగత దేశాలన్నిటికన్నా ముందు తానే

ఆమోదించింది. 1927 లో జరిగిన ఆయుధ విసర్జన సమావేశంలో "4 ఏండ్లలో సంపూర్ణ, సమస్త ఆయుధ విసర్జన" అన్న ఉపపాదనను తెచ్చి, పెట్టుబడిదారి ప్రపంచాన్ని దిగ్భ్రమ గొల్పింది. "సంపూర్ణ ఆయుధ విసర్జన," "సంపూర్ణశాంతి" సోవియట్ల కెక్కువ ఆసక్తిని కల్గించిన ఆశయాలు. ఈ ఆశయాలు అమలుసం దుంచబడితే, తాను తన దేశాన్ని పునర్నిర్మించను సంపూర్ణావకాశములు లభిం చడమేగాక, పెట్టుబడిదారి ప్రపంచం తనపై దండెత్తవలయునని చేయుచున్న ప్రయత్నములకు భగ్నము కలుగ గలదని సోవియట్ రాష్ట్రం యెరుగును. ఈ రెండు సామ్రాజ్యవాద యుద్ధాల మధ్యకాలంలో అర్ధమనస్సుతో ఉపపాదింప బడిన శాంతిప్రయత్నములన్నియు ఏదో ఒకవిధముగా పెట్టుబడిదారి ప్రపంచపు సాయుధ సైన్యాలను తనపైకి నడిపించే ప్రయత్నాలని గ్రహించింది. ఈ విష యాన్ని 1940 జనవరిలో ప్రచురింపబడిన "యుద్ధం వ్యాపించాలె?" అన్న నా గ్రంథంలో విశదంగా చర్చించాను. ఇచ్చట మచ్చుకు ఒక్క ఉదాహరణను — 1925 లో జరిగిన లొకార్నొ ఒడంబడికను — యిస్తాను.

## లొకర్నొ ఒడంబడిక అంత శాంతివంతమైంది కాదు

లొకర్నొ ఒడంబడిక యూరప్‌లో శాంతిని స్థాపించను ముఖ్యమైన ప్రయ త్నంగా ప్రపంచానికి తెలియజేయ బడినను సోవియట్ సంయుక్తరాష్ట్రం ఈ ఒడం బడికయొక్క ఉద్దేశాలను సందేహించవలసి వచ్చింది. ఇతర దేశాలలోని ప్రజ లనేకమందిగూడ ఈ ఒడంబడికను నమ్మారుకారు. ఈ ఒడంబడిక ముఖ్యోద్దేశం సోవియట్లకు విరుద్ధ రంగాన్ని స్థాపించడమేనని సోవియట్లతోపాటు చాలమంది ప్రజలు గ్రహించారు. ఆలోచించకుండా, అప్రయత్నంగా అప్పటి బ్రిటిష్ మంత్రి ఒకాతను ఈ సందేహాలను ధృఢపరిచాడు —

> "యూరప్ చరిత్రలో కొత్తగాపుట్టిన విషముష్టి చెట్టును (కమ్యూనిజాన్ని) నిర్మూలించను క్రైస్తవ నాగరికతయొక్క ఐక్యత అత్యవసరం........నా దృష్టికి లొకర్నొలో జరిగిన చర్చ కేవలం జర్మనీ తన భవిష్యత్తును పాశ్చాత్య దేశాల కర్మతో కలిసియున్నట్లు భావిస్తుందా? లేక, పాశ్చాత్య నాగరికతను ధ్వంసం చేయను రష్యాతో కలిసి పనిచేస్తుందా? అన్న సమస్యపైననే........లొకర్నొ సంధికర్థం ప్రస్తుతపు జర్మను ప్రభుత్వం, తనవరకు తాను, రష్యాతో సంబంధం లేకుండా తన బాగోగులను పాశ్చాత్య దేశాలతో ముడిపెట్టుకొనినదని."



సోవియట్ సంయుక్తరాష్ట్రం, పార్టీ లేర్పడవలయునని గాని, పోట్లాటలు జరగ వలయుననికాని, పాశ్చాత్య — ప్రాచ్య భేదము యుండవలయుననిగాని కోరలేదు. ఇతర దేశాల తగాదాలలోకి తాను అనవసరంగా లాగబడుతుందని అనుమానించి నప్పుడు అట్టి దేశాలతో సంధిచేసుకోను నిరాకరించింది. కాని, ఏ రాష్ట్రంతోనైనా సరే అనాక్రమణ సంధిని కుదుర్చుకోడానికి, ఏ రాష్ట్రంతోనైనా సరే ఆ రాష్ట్రం తనతో వ్యాపారంచేయ సిద్ధంగానున్నయెడల తానూ వ్యాపారంచేయడానికి ఆతుర్దా తోవుంది. 1935 లో జరిగిన ఫ్రాన్స్ - సోవియట్ సంధి జర్మనీగాని, మరే రాష్ట్రంగాని చేరడానికి అనువుగా నుండునట్లు ఏర్పాటు చేయబడింది. వెనుకటి అధ్యాయంలో చెప్పబడిన "శాంతి శాసనం"ను ఉపపాదిస్తూ 8-11-1917 న లెనిన్ ఇలాన్నాడు —

> "ఒడంబడికల మూలంగా కట్టుబడడానికి మన మంగీకరించము. దోపిడి, హింసలతో సంబంధంగల షరతులన్నిటిని నిరాకరించుచున్నాము. కాని, స్నేహ సంబంధాలకు, ఆర్థిక ఒప్పందాలకు అవకాశాలను కలుగజేసే షరతులన్నింటిని ఆహ్వానించుచున్నాము."

## పరిస్థితులను మార్చారు నాజీలు

1933 లో హిట్లరు అధికారానికి రావడంతో అంతర్జాతీయ రంగం మార్పు చెందింది. అప్పటికే (సోవియట్లకు విరుద్ధంగా) జర్మనీని కొద్దిపాటి భాగస్వామిగా నుంచుకొని జర్మనీచేత యెక్కువగా పోట్లాడించవలయునన్న ఉద్దేశంతో సోవి యట్లతో అనేక పోట్లాటలు, సందిగ్ధావస్థలు, యుద్ధ బెదిరింపులు సాగినమాట వాస్తవమే. ఈ ప్రయత్నాలు చాలక జర్మనీని తమతో కలుపుకొని సోవియట్లపైకి ఉసిగొల్పవలయునని పాశ్చాత్య ప్రభుత్వాల సంకల్పం. హిట్లరు అధికారానికి వచ్చిన తర్వాత ప్రపంచశక్తుల బలం మార్పుచెందింది. కొద్దిపాటి భాగస్వామిగా నుండడంతో సంతృప్తిచెందక జర్మనీ క్రమేణా పెద్ద భాగస్వామి కావడానికి ప్రయత్నించడమేగాక తనతోటి భాగస్వాములైన బ్రిటన్, ఫ్రాన్సులతో పోరాడి వారి సొంత ఆస్తి అయిన వలసరాజ్యాల్లో కొన్నింటిని తన సొంతానికి లాగుకో

గల్గిన స్థితికి వచ్చింది. ఈ మార్పువలన సోవియట్ల కషాయం ఎక్కువైనను ఈ అపాయంరాను కొంతకాలవ్యవధి జరుగునని స్పష్టమైంది. సోవియట్ సంయుక్తరాష్ట్రం తనపట్ల పాశ్చాత్య ప్రభుత్వాలకున్న ద్వేషాన్ని సరిగా గుర్తింపలేక, కొండంత ఆశతో, నానాజాతి సమితిని చేరింది.

## సోవియట్ సంయుక్తరాష్ట్రం నానాజాతి సమితిని చేరుట

పెట్టుబడిదారి దేశాలు; శాంతిని నెలకొల్పను నిజంగా పాటుబడుచున్నవని అనుకొని, అందువలననే, నానాజాతి సమితిని అతి శ్రద్ధతో సాగించుచున్నవని నమ్మి, సాముదాయక భద్రతను నెలకొల్పి యెట్టి ఆక్రమణనైనను దూరంగా నిలబెట్టవచ్చునన్న అపోహతో సోవియట్ సంయుక్తరాష్ట్రం 1934 లో నానాజాతి సమితిని సభ్యురాలుగా చేరింది. 1935 లో ఫ్రాన్సు — సోవియట్ సంధిని కుదుర్చుకున్నది. పిదప, జెకొస్లొవేకియాతో పరస్పర సహాయ సంధిని కుదుర్చుకున్నది. సోవియట్ సంయుక్తరాష్ట్రి మవలంబించుచున్న విదేశాంగ విధానాన్ని స్పష్టపరుచుచూ 1934 లో జరిగిన సోవియట్ కమ్యూనిస్ట్ పార్టీ 17 వ కాంగ్రెస్‌లో స్టాలిన్ ఇలాన్నాడు —

> "శాంతిని రక్షించడం, ఇతర దేశాలతో వ్యాపారాన్ని అభివృద్ధిచేయడం — ఇవే మా విదేశాంగ విధానానికి పునాదులు. సోవియట్ సంయుక్తరాష్ట్రం ఎవరిని బెదిరించవలయుననిగాని, ఎవరిపై దండెత్తవలయుననిగాని అనుకోడంలేదు. మేము శాంతిని కోరుచున్నాము - శాంతికొరకై పోరాడ సిద్ధముగా నున్నాము. కాని, బెదరింపులకు భయపడం. యుద్ధాన్ని రేకెత్తించేవారికి దెబ్బకు దెబ్బ బదులివ్వను సిద్ధముగా నున్నాం. శాంతిని కోరేవారు, మాతో వ్యాపారసంబంధాలను కోరేవారు సదా మాసహాయాన్ని పొందగలుగుతారు. కాని మా దేశంపై దండెత్తాలనీ ప్రయత్నించేవారు ధ్వంసంచేయబడతారు."

తర్వాత ఐదేండ్లకు, 1939 మార్చిలో, సోవియట్ కమ్యూనిస్ట్‌పార్టీ 18 వ కాంగ్రెసులో మాట్లాడుచు, మరల పై భావాలనే స్టాలిన్ ప్రకటించాడు. "ఇతరుల జీడిగింజలను నిప్పులోనుంచి లాగను" తాను నిరాకరించాడు. ఆ ఐదేండ్లకాలంలో,



1934-1939 మధ్యకాలంలో సోవియట్ల సాధనను పేర్కొన్నాడు ఈ ఉపన్యాసంలో. అబిసీనియాపై ఇటలీ జరిపిన యుద్ధం (1935) స్పెయిన్‌లో జర్మనీ, ఇటలీల జోక్యం (1936) ఉత్తర, మధ్యచైనాలను జపాన్ దండెత్తడం (1937) ఆస్ట్రియా, జెకొస్లొవేకియాలను జర్మనీ ఆక్రమించడం (1938) మొదలైన సంఘటనలకు సోవియట్ల సాధనలకుగల తారతమ్యాన్ని విశదపరిచాడు. పై క్లిష్ట పరిస్థితులన్నిటిలోగూడ సోవియట్ సంయుక్తరాష్ట్రం గౌరవనీయంగా ప్రవర్తించింది. 1935 లో ఇటలీని (ఆర్థికంగా) బహిష్కరించింది. స్పెయిన్ అంతర్యుద్ధంలో ఎవ్వరూ జోక్యం కలుగజేసుకోకూడదని బ్రిటన్ ఆడిన "తాటస్థ్య విధానం" అన్న నాటకానికి కట్టుబడింది. కాని ఇటలీ, జర్మనీలు తాటస్థ్య విధానాన్ని మించిపోయిన తర్వాత స్పెయిన్ ప్రజాస్వామ్య ప్రభుత్వానికి తన యధాశక్తి సాయము చేసింది. చైనాకు సహాయం చేసిన దేశం, మొదటినుంచి, సోవియట్ సంయుక్తరాష్ట్రిమొక్కటే. ఆస్ట్రియా విషయంలో "స్థిరంగా నిలబడాలి" అని పట్టు పట్టింది. కాని ప్రోత్సహించినవారు లేరు. జెకొస్లొవేకియాకు పరస్పర సహాయసంధి ప్రకారం సాయపడ తయారైంది. జెకొస్లొవేకియాను మిత్రులందరూ (బ్రిటన్, ఫ్రాన్సులు) చే వదలినను నాజీ జర్మనీని ఒంటరిగా జెకొస్లొవేకియా ఎదుర్కొన పూనుకున్న, తాను సైనిక సాయంచేయ సిద్ధపడింది.

## మంచి సాధన

1939 కి పూర్వం సోవియట్ సంయుక్తరాష్ట్రం అవలంబించిన విదేశాంగ విధానంలోని లోట్లను, తప్పులను, కనిపెట్టుట సోవియట్లను సదా ఖండించేవారికి గూడ కష్టతరమైన పని. 1939 సెప్టెంబరులో ప్రస్తుతం జరుగుచున్న యుద్ధం ప్రారంభమైంది. అంత క్రితం కొన్ని సంవత్సరాలుగా నానాజాతి సమితి నిరుపయోగమైనందుకు సోవియట్ సంయుక్త రాష్ట్రాన్ని నిందించ వీలులేదు. 1939 మార్చిలో హిట్లరు "ప్రేగు" నగరాన్ని ఆక్రమించినపిదపగూడా సోవియట్ ప్రవర్తనలో తప్పు కనబడదు. అప్పట్లో బ్రిటను, ఫ్రాన్సు. పోలెండు, రుమేనియాలకు తనకు సత్వర సంప్రదింపులు, చర్చలు జరగవలయునని ఒత్తిడి చేసింది. ఈ ప్రయత్నములన్నీకూడ ఆక్రమణ నడ్డగించవలెనన్న ఉద్దేశంతో చేయబడినవి. ఈ ప్రయత్నాలు అప్పట్లో సఫలత నొందియుండిన ఈనాడు యుద్ధముండేదే

కాదేమో ! అంతగా యుద్ధం ప్రారంభమైనా ఇంతకాలం సాగేదిగాదు : ఇంత అపార నష్టం కలిగేదికాదు.

పిదప కొద్ది మాసాల్లో ఆంగ్ల - సోవియట్ రాయబారాలు విఫలమైనందుననూ, 1939 ఆగస్టులో సోవియట్ - జర్మన్ అనాక్రమణ సంధి జరిగినందుననూ, పశ్చిమ యూక్రేను, పశ్చిమ బైలో రష్యాలను 1939 సెప్టెంబరులో సోవియట్ సంయుక్తరాష్ట్రం వశపరచుకున్నందుననూ, 1939 నవంబరులో సోవియట్ ఫిన్లాండులకు యుద్ధం ప్రారంభమైనందుననూ బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికాలలో సోవియట్ ప్రతికూల ప్రచారం అపారంగా సాగింది. ఈ దుష్ప్రచారం 1941 జూన్‌వరకు ఆగలేదు. 1940 లో లట్వియా, ఇస్థోనియా, లిథుయానియాలు తమంతట తాము సోవియట్ సంయుక్తరాష్ట్రాన్ని చేరినా, సోవియట్ సంయుక్తరాష్ట్రం ఈ దేశాలను ఆక్రమించిందని ప్రపంచ పెట్టుబడిదారులు దూషించారు.

పై విషయముల నన్నింటిని విమర్శించుటకు స్థలాభావంవల్ల ఇచ్చట వీలు లేదు. 1939 అక్టోబరులో ప్రచురింపబడిన "మాస్కోపై వెలుతురు" లోను, 1940 జనవరిలో ప్రచురింపబడిన "యుద్ధం వ్యాపించాలె ?" అన్న గ్రంథంలోనూ, 1941 మే లో ప్రచురింపబడిన "మీ భవిష్యత్తును ఏర్పరచుకొనుడు" అన్న పుస్తకంలోనూ, కొంతవరకు, పై విషయాలను విమర్శించినాను. పై రచనలలో సోవియట్ సంయుక్తరాష్ట్రి ప్రవర్తన సరియైనదని ఋజువు చేయబడింది. ఇటీవల జరిగిన సంఘటనలు నా వాదాన్ని బలపరచినవి : సోవియట్ సంయుక్తరాష్ట్రం అవలంబించిన మార్గాల ముఖ్యోద్దేశాలను స్పష్టపరచినవి. ఇంతవరకు ఈ పుస్తకంలో వ్రాసినదాన్నిబట్టి సోవియట్ సంయుక్తరాష్ట్రి ప్రవర్తన సత్ప్రవర్తనయని ఋజువైనది గనుక మన పత్రికలలో సోవియట్లను గురించి మనం చదివే విషయాలన్నీ అబద్ధాలని తేలుచున్నవి. చాలాకాలంగా అనుమానింప బడిన.దండయాత్ర పశ్చిమాన్నుంచి సోవియట్లపైకి 22-6-41 న విరుచుకొని పడినప్పుడు కెరీలియన్ ద్వీప కల్పాన్నీ, బాల్టిక్ ప్రజాస్వామ్యాలు మూటినీ, పశ్చిమ యూక్రేనునూ, పశ్చిమ బైలో రష్యానూ, బెస్సరేబియానూ సోవియట్ సంయుక్తరాష్ట్రం తన ఆధీనమందుంచుకున్నందుకు మనమందరం సంతసించాలి - సోవియట్లకు కృతజ్ఞులం కావాలి.



# 3. సోవియట్ - జర్మను సంబంధాలు

సోవియట్ - జర్మనీలకు గల సంబంధాలను మూడు యుగాలక్రింద విభజింపవచ్చు —(1) 1917 నుంచి 1933 లో నాజీలు అధికారమునకు వచ్చు వరకూ, (2) 1933 నుంచి 1939 ఆగస్టు, లేక సెప్టెంబరు వరకూ, (3) 1939 ఆగస్టునుంచి 1941 జూన్ 22 వ తారీకు వరకునూ.

మొదటియుగం జర్మనీ మహత్తర శక్తిగానుండి మిత్రమండలి రాజ్యాలతో హోరాహోరిగా పోరుచున్న ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధంతో ప్రారంభమౌతూవున్నవి. కాని తనకన్న బలశాలులైన రాజ్యా లనేకం ఏకమై జర్మనీని ఓడించినవి. ఈ ఓటమి తదనంతరం చాలకాలంవరకు జర్మనీ అణగద్రొక్కి యుంచబడింది. అవమాన పరచబడింది. జర్మనీలో క్లిష్టపరిస్థితు లేర్పడినవి. తర్వాత నాజీలు తలచూపారు. ఈ యుగ ఆరంభంలో జర్మనులు నూతన సామ్యవాద రాష్ట్రింపట్ల అమానుషంగా ప్రవర్తించారు. 1918 లో దోపిడి దారి సంధియని ఎరిగికూడ బ్రెస్ట్ - లిటొవ్స్క్ సంధిని సోవియట్ సంయుక్తరాష్ట్రం సంతకం చేయక తప్పిందికాదు. సోవియట్లతో సంధిచేసుకొనికూడ ఫిన్లాండులోని "తెల్ల భటులు"ను సోవియట్లపైకి ఉసిగొల్పనూ, వారికి సాయపడనూ జర్మనీ తన సైన్యాలను ఫిన్లాండుకు పంపింది. 1919 లో తన సైన్యాలనంపి యూక్రేన్‌లో జోక్యం పుచ్చుకుంది. కాని 1919 వర్సలీస్ సంధి అనంతరం సోవియట్లను, జర్మనీని - రెంటిని పెట్టుబడిదారి రాష్ట్రాలు వెలివేసినవి. సోవియట్‌రాష్ట్రం సామ్యవాదరాష్ట్రం గనుక, ఇతరులకీ వ్యాధి అంటుకుందేమో అన్న భయంవలన, పెట్టుబడిదారులు దానిని దూరంగా•నుంచవలెనన్నారు. జర్మనీ, ఓడిపోయిన విరోధియైనా, పారిశ్రామికంగా గొప్ప బలంగల విరోధి గనుక దానిని లేవలేని స్థితిలోనే ఉంచవలెనన్నారు. అందువల్ల 1922 వసంతకాలంలో జరిగిన జినోకాన్ఫరెన్సులో ఈ రెండు రాష్ట్రాలను "గౌరవనీయు"లైన యూరప్ ప్రభుత్వాలు అగౌరవ పరచినందున ఈ రెండురాష్ట్రాల ప్రతినిధులు రపెల్లోకు ప్రయాణమై అచ్చట ఒక ఒడంబడికను కుదుర్చుకొన్నారు.

## జర్మనీ కొరడా దెబ్బకు లొంగింది

ఆనాటి జర్మనీ సోవియట్‌రాష్ట్రంతో స్నేహాన్ని కోరడానికి అనేక కారణా లున్నాయి. సోవియట్‌రాష్ట్రం జర్మనీతో స్నేహాన్ని నిరాకరించడానికి కారణాలేవీ లేవు. కాని జర్మనీ ఆర్థికంగా చాల బలహీన స్థితిలో నున్నందుననూ, సైనికంగా అంతకన్నా మరీ బలహీనస్థితిలో నున్నందుననూ మిత్రరాజ్యాల "కొరడాదెబ్బలకు" లొంగిపోయింది. ఈ మిత్రరాజ్యాలు జర్మనీ బలపడకూడదనీ, జర్మను పాలక వర్గంమాత్రం ప్రజలు తమ దేశాన్ని సామ్యవాద దేశంగా మార్చ ప్రయత్నించిన వారిని అణచివేయగల బలం కలిగియుండాలనీ ప్రయత్నించినవి. ఈ ఉద్దేశం తోనే 1923 లో ఫ్రెంచి సైన్యాలు రూర్‌లోయను దండెత్తినప్పుడు జర్మనీలో గొప్ప క్లిష్టత ఏర్పడింది. వెంటనే పెట్టుబడిదారి ప్రపంచం ఆ అవకాశాన్ని ఉపయోగించు కొని, "జర్మనీ సామ్యవాదాన్ని అవలంబించి సోవియట్లలో చేరనున్నది" అన్న వెనుభూతాన్ని మేలుకొల్పారు. అట్టి దుస్థితి సంభవించకుండా అడ్డడానికి పాశ్చాత్య ప్రభుత్వాలు, అమెరికా కలుగజేసుకొని, త్వరపడి, జర్మనీని పెట్టుబడిదారి రాష్ట్రంగా నిలబెట్టను ప్రయత్నించారు. ఈ ప్రయత్న ఫలితంగా డవేస్‌ప్లాన్ మొదలైన మార్గాల జర్మనీకి అప్పు పెట్టారు. పిదప లొకర్నొ సంధిమూలంగా జర్మనీని పెట్టుబడిదారి రాష్ట్రంగా నిలబెట్టారు. ఈవిధంగా పాశ్చాత్య ప్రభుత్వాలు అప్పుపెట్టడంవల్ల, జర్మనీ తనకు పెట్టుబడి పెట్టినవారి విరోధులతో (సోవియట్ రాష్ట్రంతో) కొంతకాలం సఖ్యత మానుకోవలసి వచ్చింది. కాని 1925 లో జినీవా లోని నానాజాతి సమితిలో తనకు స్థిరసభ్యత్వాన్ని ఇవ్వను పాశ్చాత్య దేశాలు నిరాక రించినందున మరల జర్మనీ సోవియట్ సంయుక్తరాష్ట్రంవైపు మళ్ళింది. జర్మనీ 1926 లో సోవియట్ రష్యాతో పరస్పర అనాక్రమణ సంధిని చేసుకొన్నందున 1922 లో చేసుకున్న రపెల్లొ సంధి ధృవపడింది.

ఈ యుగంలో సోవియట్ సంయుక్తరాష్ట్రం తన నిర్ణయప్రకారం తనతో ఏ దేశం వ్యాపారంచేయ నిచ్చగించినా ఆ దేశంతో వ్యాపారం సాగించింది. రహస్య రాజకీయ సంబంధాల మూలంగా శాంతి స్థాపన వీలైతే అట్టి ప్రయత్నా నికి పూనుకున్నది. 1929-37 మధ్యకాలంలో సోవియట్ సంయుక్తరాష్ట్రానికి



జర్మనీ, బ్రిటన్, అమెరికాలతో జరిగిన వ్యాపారం ఈ దిగువ అంకెలను బట్టి తెలియవగును —

| | బ్రిటను | జర్మనీ | అమెరికా |
| --- | --- | --- | --- |
| సోవియట్ల మొత్తం దిగుమతి, | రూ. 10,31,100. | రూ. 19,04,550. | రూ. 12,44,400. |
| సోవియట్ల మొత్తం ఎగుమతి, | రూ. 23,20,350. | రూ. 11,83,650. | రూ. 5,71,650. |

(నానాజాతి సమితి ప్రచురించిన "అంతర్జాతీయ వ్యాపార లెక్కల"నుంచి)

1932 లో ఎమిలి లడ్విగ్ స్టాలిన్‌తో సంభాషించినప్పుడు స్టాలిన్ చెప్పిన మాటలు కొన్నిటిని ఇప్పుడు జ్ఞప్తికి తెచ్చుకోడం అవసరం —

> "ఏ ఒక జాతిపట్ల, లేక ఒక జాతియొక్క ప్రజలపట్ల మాకు సానుభూతి గలదని చెప్పవలసివచ్చిన జర్మనులపట్ల మాకు సానుభూతి హెచ్చని చెప్పక తప్పదు."

జర్మనీ రష్యానుచూచి సామ్యవాదాన్ని అవలంబిస్తుందని లెనిన్ చాల ఆశపడ్డాడు. 1918 లోను 1923 లోను గూడ అతని ఆశలకు తగిన కారణాలు అగుపడినవి. జర్మను శ్రామికవర్గ నాయకులు సరియైనవారు కానందుననూ, ఇతర ప్రభుత్వాల జోక్యంవల్లనూ, జర్మనీలో సామ్యవాదం స్థాపించబడలేదు.

## నాజీజానికి ప్రతీకారములు

ఏ కారణాలవల్ల నయితేనేమి 1933 లో జర్మనీలో ఫాసీజం అధికారానికి వచ్చింది. ఆర్థిక దుస్థితి ఫలితంగా ఈ ప్రభుత్వం తగిన బలాన్నీ, దౌర్జన్యాన్నీ సంపాదించింది. సోవియట్ సంయుక్తరాష్ట్రం జర్మనీతో స్నేహంగా ఉందామని ఎంత ప్రయత్నించినా వీలైందిగాదు. శాంతిని భద్రపరచను మరేమార్గం కనబడ నందున 1934 లో సోవియట్ సంయుక్తరాష్ట్రం నానాజాతి సమితిని చేరింది. తత్ఫలితాలు ఉత్సాహకరంగా లేవని ముందే గమనించాం. నాజీలు "బోల్షివిజం పైకి దండయాత్ర" అన్న నినాదంతో యుక్రేన్‌ను, కాకసస్‌ను దండెత్త ప్రయ

త్నిస్తారని సోవియట్ సంయుక్తరాష్ట్రం గ్రహించింది. అందువల్ల ఈ రెండు దేశాలమధ్య కొంత ఘర్షణ తప్పిందికాదు. సోవియట్ - జర్మను వ్యాపారం తగ్గింది. 1922, 1926 సంధుల మూలంగా ఏర్పడినకొద్ది స్నేహంకూడా అంతరించింది. ఈ రోజుల్లో, అంతవరకు తనతో విరోధంగావున్న ప్రభుత్వాలతో జర్మనీ, చాల పలుకుబడి సంపాదించింది. ఆ దేశాలు జర్మనీకి అప్పుపెట్టినవి. జర్మనీతో సంధులు, ఒడంబడికలు చేసుకున్నవి. ఈ సంధులలో ముఖ్యమైనవి 1935 లో జరిగిన ఆంగ్ల - జర్మను నౌకాసంధి, 1938 లో జరిగిన మ్యూనిక్ సంధి. జర్మనీ స్పెయిన్‌లో కలుగజేసుకున్నా, ఆస్ట్రియా, జెకొస్లొవేకియాలను ఆక్రమించినా పెట్టుబడిదారి ప్రజాస్వామ్యాలు సహించినవి. ఈ సహనం కేవలం జర్మనీని "బోల్షివిజానికి విరుద్ధంగా" లేవదీయాలన్న ఉద్దేశమనాలే గాని వేరుగా అర్థంచేసుకోను వీల్లేదు.

## పంచమ దళం

ఈ రోజుల్లోనే సోవియట్ ప్రభుత్వం తన దేశంలోని "పంచమదళం"ను కనుగొని ఫాసిస్టు కుట్రలను నాశనంచేయగల్గిందని మొదటి అధ్యాయంలోనే గమనించాం. నాజీలు యూరప్‌లోని ప్రతి దేశంలోను పంచమదళాన్ని, క్విస్లింగులను (నార్వేలో నాజీలకు సాయపడిన దేశద్రోహి పేరు క్విస్లింగ్. మాతృదేశ స్వాతంత్ర్యాన్ని సంపాదించను ప్రాణ మర్పించే బదులు పరపాలకులకు సాయపడి తమ ప్రజల నణగద్రొక్కేవా రందరిని క్విస్లింగులు అని అంటారు.) సులభంగా ఏర్పరచుకొన గల్గుటకు కారణం ప్రతి పెట్టుబడిదారి దేశంలోని అధికారవర్గంలో నానాటికి హెచ్చుమంది తమ దేశ స్వాతంత్ర్యానికన్నా, శ్రామిక వర్గాన్ని తమ అధికారంకింద నుంచుకొనుటయే ఎక్కువ ప్రధానంగా భావించడమే. ఈ ప్రయత్నాలన్నీ ఇటీవల మనకు విదితమైనవే. సోవియట్లు తమ దేశద్రోహులను కనుగొని, విచారించి శిక్షించుచున్న సమయంలో ప్రపంచమంతా సోవియట్ల నందుకు నిందించింది. కాని ఈ యుద్ధం ప్రారంభమైన నాటినుంచి జరిగిన విషాద సంఘటనలను బట్టి సోవియట్లు అతి జాగరూకతతో, సకాలమున, సక్రమచర్య తీసుకున్నవని మన మిప్పుడెరుగుదుము. నేడు సోవియట్లు విరోధి నింతసాహసంతో, ఇంతటి ఐక్యతతో ఎదుర్కొడానికి కారణం ఆనాటి "దేశద్రోహుల విచారణలు" అని మన



మిప్పటికైనా గుర్తించాలి. ఫ్రాన్సు, బెల్జియం, డెన్మార్కు, నార్వే, హాలండ్ మొదలైన దేశాలు అప్రయత్నంగా హిట్లరు కెందుకు పాదాక్రాంతమైనవని యోచించిన ఈ సత్యం బోధపడుతుంది.

## 1939 వసంతము — వేసవి.

1933-39 మధ్యకాలంలో సోవియట్ - జర్మను సంబంధాలలో పేర్కొదగిన విషయాలేవీ లేవు. 1939 వసంత ఋతువులో మరల నూతన సంఘటన లారంభమైనవి. అప్పటికి యూరప్ శాంతికి నాజీ జర్మనీ గొప్ప విరోధిగా పరిణమించింది. నాజీ జర్మని గొప్ప బలశాలిగూడ అయింది. కాని ఐక్యతలేని పాశ్చాత్య ప్రభుత్వాలకన్నా సోవియట్ సంయుక్తరాష్ట్రమంటేనే జర్మనీకి ఎక్కువ భయం. అందువలన బలహీనమైన చిన్న దేశాలను ముందు దండెత్త నారంభించింది. పిదప నిద్రబోవుచున్న పెద్ద దేశాలనే ఎదిరించ పూనుకుంది. 1939 మార్చిలో, అప్పటికే విచ్ఛిన్నమైయున్న జెకొస్లొవేకియాను ఆక్రమించింది. అంతటితో ఫ్రాన్సు, బ్రిటనులలో ప్రజాందోళన ప్రారంభమైంది. సోవియట్లతో కలిసి శాంతిరంగాన్ని నెలకొల్పమని ప్రజలు ఆందోళన చేశారు. ఈ ప్రజాందోళనను నిరాకరించలేక ఫ్రాన్సు, బ్రిటన్ ప్రభుత్వాలు సోవియట్లతో కలిసి శాంతి రంగాన్ని నెలకొల్ప ప్రయత్నించినవి. ఈ ప్రయత్నం కేవల మొక నాటకం.

రెండవ అధ్యాయంలో ఈ సంధి ప్రయత్నాల గురించి క్లుప్తంగా వ్రాశాను. ప్రస్తుతం మనం చర్చించవలసిన విషయం జర్మన్ - సోవియట్ అనాక్రమణ సంధి (23-8-1939), జర్మన్ - సోవియట్ సరిహద్దు స్నేహసంధి (29-8-1939), - ఈ రెంటినిగూర్చి. ఈ విషయమంతాగూడా విశదంగా "మాస్కోపై వెలుతురు" అన్న గ్రంథంలో చర్చించాను. కాని సోవియట్ సంయుక్తరాష్ట్రం జర్మనీతో సంధి చేసుకోడం మహా పాతకమనీ, అందువలననే ప్రస్తుత యుద్ధం ప్రారంభమైనదనీ కొత్తగా దుష్ప్రచారం ప్రపంచమంతటినీ అల్లుకొని పోయింది. అందువలననే సోవియట్ సంయుక్తరాష్ట్రం జర్మనీతో సఖ్యతను ఎందుకు కుదుర్చుకోవలసి వచ్చిందో ఇచ్చట వివరించుచున్నాను. ఈ సందర్భంలో 31-8-1939 న "జర్మన్ - సోవియట్ అనాక్రమణ సంధిని గురించి మొలటోవ్ చెప్పిన మాట

నుదాహరించిన చాలును. ఈ అత్యంత ప్రాధాన్యమైన ఉపన్యాసాన్ని బ్రిటిష్ పత్రికలు లెక్కలోకి తీసుకొననే లేదు.

"ఆక్రమణ నడ్డనూ ఆంగ్ల - ఫ్రెంచి - సోవియట్ ప్రభుత్వాలమధ్య పరస్పర సహాయసంధిని కుదర్చనూ ప్రయత్నములు ఏప్రిల్ (1939) లోనే ప్రారంభమైనవి.......నాలుగు మాసాలపాటు సాగినవి. కాని గొప్ప ఆటంకా లేర్పడినవి........గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, సోవియట్ సంయుక్త రాష్ట్రం కలిపి పోలండుకు రక్షణ పూచీ నివ్వవలెను. కాని సోవియట్ సైనిక సహాయాన్ని పోలండు పొంద నిరాకరించింది. అన్నిటిలోకి గొప్ప ఆటంక మిదే. పోలండు కల్పించుచున్న అభ్యంతరాలను దాటడానికి చేయబడిన ప్రయత్నాలన్నీ విఫలమైనవి. పోలండు కల్గించుచున్న కష్టాల గ్రేట్ బ్రిటన్ దాట ప్రయత్నించక పోవడామేగాక ఆటంకాల కల్గించుచునే యుండమని పోలండును ప్రోత్సహించింది గూడను..........అటు తర్వాతనే మాకునూ తెలిసివచ్చింది, ఆంగ్ల - ఫ్రెంచి - సోవియట్ రాయబారాలు సఫలత నొందజాలవని.....అట్టి పరిస్థితులలో పరస్పర సహాయ సంధి కుదర్చను ప్రయత్నించి చూడండి ! ముఖ్యంగా సోవియట్ సంయుక్త రాష్ట్రంనుంచి సహాయం మా కక్కరలేదనీ, అనవసరమనీ, అట్టి సహాయం జోక్యతగా పరిగణింప బడుతుందనీ (పోలండుచే) ముందుగా ప్రకటింపబడినప్పుడు.

"తదుపరి, సోవియట్ సంయుక్తరాష్ట్రం ఆక్రమణ నెదిరి ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్లకు సైనిక సహాయంచేసే షరతున ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్లు ఆక్రమణ నెదిరి సోవియట్ సంయుక్తరాష్ట్రానికి సైనిక సహాయం చేస్తామని పూచీ నిచ్చినవి. కాని, ఫ్రాన్స్, బ్రిటన్లు తమ పూచీకి ఎన్నో షరత్తులను తగిలించడం మూలాన ఈ సహాయం బూటకమని స్పష్టమైంది. ఈ నెపములతో సోవియట్లకు సహాయం చేయకుండా తప్పించుకోడానికి ఫ్రాన్స్, బ్రిటన్లు ప్రయత్నించుచున్నవని విదితమైంది.

"మరల (ఆరోజుల్లోనే) ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్లు సోవియట్లతో రాయబారాలు అత్యవసరమని ఒకవైపు ప్రకటించుచు, మరొకవైపు అందుకు తామే విముఖులైయున్నట్లు నడచినవి....



"గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్‌లతో జరిగిన సైనిక సంభాషణలు నెరవేర నేరవని రూఢియైన తర్వాత సోవియట్ - జర్మను అనాక్రమణ సంధి ప్రయత్నాలు ప్రారంభింప బడినవి........జర్మనీ - సోవియట్ల మధ్య యుద్ధం రాకుండా చేయనూ, శాంతిని సాగించనూ ఇతర అవకాశాలను (ఫ్రాన్స్, బ్రిటన్లతో సంధిగాక) మేము ప్రయత్నింపక తప్పిందికాదు........సోవియట్ ప్రజల క్షేమాన్ని గమనించడం, సోవియట్ రాష్ట్రంయొక్క క్షేమాన్ని యోజించడం మా విధి అయియున్నది."

పై నుదహరింపబడిన మాలటోవ్ ఉపన్యాసాన్ని చదివిన జర్మన్ - సోవియట్ అనాక్రమణ సంధిని గురించి అప్పట్లో పెట్టుబడిదారి ప్రపంచం సాగించిన దుష్ప్రచారం, దూషణా, హేళనలన్నీగూడా అనవసరమని తేలును. అప్పట్లో, "న్యూస్ - క్రానికల్" పత్రికలో ఈ సంధిని గురించి ఎ. జె. కుమ్మింగ్స్ ఇలా వ్రాశాడు —

"పోలండు, ఫ్రాన్స్, బ్రిటనులు సమాన ప్రతిపత్తిని సోవియట్ల సహకారాన్ని కోరడం లేదు సరేగదా, వీరైతే రష్యాను చేయివిడిచి, ఏకాకినిచేసి, ఏదో ఒక విధంగా జర్మనీతో సంధిజేసుకోను సిద్ధముగానున్నదన్న నమ్మకానికి వచ్చాడు, స్టాలిన్."

## 1939 సెప్టెంబరునుంచి 1941 జూన్ వరకు

జర్మనీతో అనాక్రమణ సంధిని చేసుకున్న తర్వాతగూడ జర్మనీ ఎన్నడో తనపై దండయాత్ర సాగిస్తుందని సోవియట్ సంయుక్తరాష్ట్రం ఎరుగును. కాని ఫలానప్పుడని నిర్ణయించలేక పోయింది. ఈ 22 నెలల మధ్యకాలాన్ని తన సరిహద్దులను పొడిగించడంలోను, తన యుద్ధ యత్నాన్ని కొనసాగించడంలోను, ఈ సమయంలో జర్మనీతో ఏవిధమైన పోట్లాట కవకాశం ఇవ్వకుండానూ గడిపింది. అట్టి జాగ్రత్త తీసుకోవడం ఎంతో అవసరమని నేడు మన మెరుగుదుము. ఈ సందర్భంలో ఆదినుంచి సోవియట్ మిత్రుడైన, దూరదృష్టిగల బెర్నార్డ్‌షా మాటల నుదాహరించడం అత్యవసరం. 1941 మే 31 వ తారీకున షా ఇలా వ్రాశాడు —

"గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్‌లతో జరిగిన సైనిక సంభాషణలు నెరవేర నేరవని రూఢియైన తర్వాత సోవియట్ - జర్మను అనాక్రమణ సంధి ప్రయత్నాలు ప్రారంభింప బడినవి........జర్మనీ - సోవియట్ల మధ్య యుద్ధం రాకుండా చేయనూ, శాంతిని సాగించనూ ఇతర అవకాశాలను (ఫ్రాన్స్, బ్రిటన్లతో సంధిగాక) మేము ప్రయత్నింపక తప్పిందికాదు........సోవియట్ ప్రజల క్షేమాన్ని గమనించడం, సోవియట్ రాష్ట్రంయొక్క క్షేమాన్ని యోజించడం మా విధి అయియున్నది."

పై నుదహరింపబడిన మాలటోవ్ ఉపన్యాసాన్ని చదివిన జర్మన్ - సోవియట్ అనాక్రమణ సంధిని గురించి అప్పట్లో పెట్టుబడిదారి ప్రపంచం సాగించిన దుష్ప్రచారం, దూషణా, హేళనలన్నీగూడా అనవసరమని తేలును. అప్పట్లో, "న్యూస్ - క్రానికల్" పత్రికలో ఈ సంధిని గురించి ఎ. జె. కుమ్మింగ్స్ ఇలా వ్రాశాడు —

"పోలండు, ఫ్రాన్స్, బ్రిటనులు సమాన ప్రతిపత్తిని సోవియట్ల సహకారాన్ని కోరడం లేదు సరేగదా, వీరైతే రష్యాను చేయివిడిచి, ఏకాకినిచేసి, ఏదో ఒక విధంగా జర్మనీతో సంధిజేసుకోను సిద్ధముగానున్నవన్న నమ్మకానికి వచ్చాడు, స్టాలిన్."

## 1939 సెప్టెంబరునుంచి 1941 జూన్ వరకు

జర్మనీతో అనాక్రమణ సంధిని చేసుకున్న తర్వాతగూడ జర్మనీ ఎన్నడో తనపై దండయాత్ర సాగిస్తుందని సోవియట్ సంయుక్తరాష్ట్రం ఎరుగును. కాని ఫలానప్పుడని నిర్ణయించలేక పోయింది. ఈ 22 నెలల మధ్యకాలాన్ని తన సరిహద్దులను పొడిగించడంలోను, తన యుద్ధ యత్నాన్ని కొనసాగించడంలోను, ఈ సమయంలో జర్మనీతో ఏవిధమైన పోట్లాట కవకాశం ఇవ్వకుండానూ గడిపింది. అట్టి జాగ్రత్త తీసుకోవడం ఎంతో అవసరమని నేడు మన మెరుగుదుము. ఈ సందర్భంలో ఆదినుంచి సోవియట్ మిత్రుడైన, దూరదృష్టిగల బెర్నార్డ్‌షా మాటల నుదాహరించడం అత్యవసరం. 1941 మే 31 వ తారీకున షా ఇలా వ్రాశాడు —



గ్రేట్ బ్రిటన్ జర్మనీకి చేసిన సరఫరాతో పోలిస్తే దోమకు, ఏనుగకు గల వ్యత్యాసం అగుపడుతుంది. సోవియట్లు జర్మనీతో వ్యాపారంచేయ నిరాకరించియున్న లాభమెవరికి? బ్రిటనుకు. కాని బ్రిటిష్‌వారు తాము సోవియట్లపట్ల జర్మనీకన్నా తక్కువ ద్వేషం కలిగియుండలేదని ఇటీవలే స్పష్ట పరిచారు. పైగా, జర్మనీతో వ్యాపారం ఆపుకున్న పోట్లాటను కొనితెచ్చుకున్నట్లౌతుంది. అందువలన యితరత్రా కలిగే లాభమైనా వేరు లేదు.

ఈ పరిస్థితులను చక్కగా గ్రహించి సోవియట్లు తెలివిగల విధానాన్ని అనుసరించినవి. జర్మనీతో మితంగా వ్యాపారం చేయడం, వీలైనంతవరకు తా నెగుమతిచేయు వస్తువులు యుద్ధానికి ఉపయోగ పడనివిగా ఉండేట్లు ప్రయత్నించడం. ఏది ఎట్లున్నా సోవియట్ రాష్ట్రం ఎక్కువగా ఎగుమతి చేయజాలదు. ఇతర దేశాలన్నిటి ఆర్థిక విధానాలకన్న సోవియట్ ఆర్థిక విధానం హెచ్చుస్వయం సంపూర్ణముగా నున్నది. సోవియట్ ఉత్పత్తి అంతాగూడ సోవియట్ ప్రజలే అనుభవించుచున్నారు. సాధారణంగా సోవియట్ ఎగుమతి మొత్తం ఉత్పత్తిలో 3% కెక్కువ ఉండదు. జర్మనీతో నగదు వ్యాపారం చేసింది. సోవియట్ ఎగుమతిలో (జర్మనీకి) ఎక్కువభాగం గోధుమ ఆక్రమించింది. ఈ ఎగుమతిలో సైన్యాలకు, యుద్ధయత్నాలకు ఉపయోగపడు వస్తువు లేవీ లేవు. సైన్యాల కుపయోగపడే వస్తువులు ఎగుమతీ చేయబడడం లేదని 1941 ఆరంభంలో జర్మనీ గొణగడాని కారంభించింది.

1940 నవంబరులో మాలటోవ్ బెర్లిన్ ప్రయాణం నాజీలకు గొప్ప ఆశాభంగమును కల్గించింది. సోవియట్ అక్షరాజ్యాలను చేరుతుందనీ, తనదేశాన్ని కొంత హిట్లరుకు సోవియట్ వదలనున్నదనీ, టర్కీ, ఇండియా, ఇరాన్‌లకు నష్టంకల్గేటట్లు సోవియట్లు జర్మనీతో కుట్ర పన్నుచున్నవనీ ప్రతిదేశంలో వదంతులు చెలరేగినవి. జర్మనులు అక్షరాజ్యాలను చేరమని సోవియట్లను బలవంత పరిచారని స్పష్టమౌతున్నది. కాని సోవియట్లందు కంగీకరించలేదు. మితమైన అవకాశాలు గల నూతన ఆర్థిక ఒడంబడిక కుదుర్చుకొనబడినది. అంతటితో మాస్కో చేరాడు మాలటోవ్, నాజీ జర్మనీకి ఇది రహస్య రాజకీయ విధానంలో గొప్ప ఓటమి.

## కలహానికి ముందు

22–6–1941 న హిట్లరు సోవియట్‌రాష్ట్రంపై దండెత్తడానికి 10 లేక 20 రోజులకుముందు బ్రిటిష్ పత్రికల ప్రవర్తనను గమనించిన ఈ పత్రికలు సోవియట్ల దృష్టిపథాన్ని గ్రహించ నిరాకరించినవని స్పష్టమౌతుంది. జర్మనీ తూర్పు పరిహద్దులలో హిట్లరు అపారసైన్యాలను సమకూర్చాడు. ఈ చర్య కేవలం సోవియట్లను బెదిరించడానికై అయి ఉండవచ్చు. లేక సోవియట్ సంయుక్తరాష్ట్రం బెదరిపోయి లొంగకపోతే ప్రస్తుతం ప్రారంభించిన దండయాత్రకై యుండవచ్చు. హిట్లరు సైన్యాలను చేర్చేప్పటికల్లా బ్రిటిష్ పత్రికలు సోవియట్ సంయుక్తరాష్ట్రం హిట్లరుకు లొంగిపోయిందని, ఏదో బలహీనమైన దేశం, స్వయంరక్షణ శక్తిలేని దేశం ప్రవర్తించినట్లు సోవియట్ సంయుక్తరాష్ట్రి ప్రవర్తనను చిత్రించినవి. అక్ష రాజ్యాలు గెలుపొందినవనీ, జర్మనీని సంతృప్తిపరచను మ్యూనిక్‌కన్నా గొప్ప ప్రయత్నం జరుగుచున్నదనీ, అపరిమిత ఆర్థిక సౌకర్యాలు జర్మనీకి కల్గింపబడుచున్నవనీ, కాకసస్, యూక్రేన్లను నాజీలు కొంతవరకు తమ వలసరాష్ట్రాలుగా మార్చుకున్నారనీ ఈ చర్య లన్నిటినీ సోవియట్ ప్రభుత్వం ఆమోదించినదనీ బ్రిటిష్ పత్రికలు అపూర్వ ప్రచారం చేసినవి. కాని, ఈ ప్రచారమంతా అబద్ధమనీ, స్టాలిన్ హిట్లరును సంతృప్తి పరుపడనీ, సంతృప్తి పరుప ప్రయత్నానైనను చేయడనీ సోవియట్ రాష్ట్రి చర్యలను చక్కగా అర్థంచేసుకో గలిగినవారందరూ ఎరుగుదురు. సంతృప్తి పరుపబడలేదు గనుకనే హిట్లరు దండెత్తాడు.

## దండెత్తడ మెందుకు?

ఈ సమయంలో (22–7–1941 న) హిట్లరు సోవియట్ల నెందుకు దండెత్తవలసి వచ్చింది? ఇందుకు బహుశ 4 కారణాలున్నాయి —

(1) ఎర్రసైన్యమంటే హిట్లరుకు భయం. నాజీ సైన్యాలు పశ్చిమరంగంలో నానాటికి బలహీనమౌతుండగా ఎర్రసైన్యాల బలం నానాటికీ హెచ్చుతూ ఉన్నదన్న భయం.

(2) బ్రిటను, అమెరికాల ఉత్పత్తిశక్తి పరిపూర్ణతను జెందిన తన ఉత్పత్తి శక్తిని మించిపోతవన్న భయం.



(3) తా నాక్రమించిన రాజ్యాల్లో, ముఖ్యంగా బాల్కన్ రాజ్యాల్లో, బహుశా జర్మనీలోగూడాను, తిరుగుబాట్లు ప్రారంభంకావచ్చునని, ఈ తిరుగుబాట్లు ఎర్రసైన్యాన్ని ఎదురుచూచునన్న భయం.

(4) పూర్వపు "బోల్షివిజంమీది మతయుద్ధం" అన్న పొలికేకను లేవదీసి, పాశ్చాత్య ప్రజాస్వామ్య శక్తులను భేదించి, వాటితో ఏదో ఒకవిధంగా రాజీ చేసుకోవచ్చునన్న ఆశ. ఆశ ఏమిటి నమ్మకమే. హెస్సు ఇంగ్లండుకు వచ్చిన కారణం ఇదేనని గ్లాస్గో నగరంలో లార్డ్‌ప్రావోస్ట్ అయిన సర్‌పాట్రిక్ డోలన్ 4-11-1942 న లండన్‌లోని "డెయిలీ మైల్" అన్న పత్రికా విలేఖరికి తెలియజేశాడు. బ్రిటిష్ ప్రభుత్వం 12-7-1941 న సోవియట్లతో సంధి సంతకాలు చేసినా ఆ అపాయం (హిట్లరుతో బ్రిటిష్ ప్రభుత్వం రాజీపడుతుందన్న అపాయం) ఇంకా ఉండనే ఉంది. 6 వ. అధ్యాయంలో ఈ విషయాన్ని విశదంగా చర్చిస్తాను.

## "కమ్యూ - నాజీ" - అర్థంలేని కూతలు

నాజీ జర్మనీ, కమ్యూనిస్ట్ రష్యా యుద్ధంచేయుచున్నను ఈ రెండు రాష్ట్రాల సాంఘికస్థితులలో ఎలాంటి భేదంలేదని రెండు ఒకటేనని వాదించేవారు అనేకమంది నేటికీ ఉన్నందుననూ ఈ అర్థంలేని కూతలను చర్చించవలసి వచ్చింది. ఈ రెండు రాజ్యాలు పరస్పరం నాశనంచేసుకుంటే మనందరికి క్షేమమని అనేవారు చాలమంది ఉన్నారు. బ్రిటిష్ రాజకీయ నాయకులలో ఎక్కువ మితవాదులైనవారు గూడ అనేకులు ఆధారంలేని ఈ అబద్ధాలకు దోహద మిచ్చారు. ఈ మూఢనమ్మకాన్ని బలపరచను బి. బి. సి. (బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్) "కమ్యూ - నాజీ" అన్న పదాన్ని సృష్టించింది. నిజమేమిటి? కొద్దిలో చెప్పడం కష్టం. అయినా ప్రయత్నిస్తాను.

## నాజీజం స్వభావం

నాజీలు అంటే ఎవరు? క్రుప్స్, థెయిసన్ మొదలైన జర్మను ధనికులు, జంకర్ భూస్వాములు కలిసి తమ కార్యసాధనకై నిర్మించిన ప్రజాసంస్థే నాజీలు. శ్రామికులు చైతన్యాన్ని పొందుచున్నారన్న భయంతో, ఈనాటి ఆపార ఉత్పత్తి

ఫలితాలలో తమకు భాగం కావాలని శ్రామికు లడుగుచున్నారన్న భీతితో, తమ పెట్టుబడిదారి గుత్తవ్యాపారాలను భద్రపరచుకోనూ, శ్రామికుల నణగద్రొక్కనూ, జర్మను కోటీశ్వరులు ప్రజాబాహుళ్యంనుంచే నాజీలన్న దుండగీండ్రను నిర్మించారు. పెట్టుబడిదారి విధానంలో ఉత్పత్తి సాధనాలు కొద్దిమంది ధనికుల సొమ్మైయుండి లాభంకొరకు నడిపింప బడుచున్నవి. లాభమే లేకుంటే ఈ మహనీయులు జీవిత అవసరాలనైనా సరే ఉత్పత్తి చేయరు. ప్రజలకు జీవిత అవసరాలే సరఫరా కానప్పుడు, ఈ జీవిత అవసరాలు లాభంకొరకు తమనుండి దాచిపెట్టబడినప్పుడు వారా సంఘవిధానాన్ని ధ్వంసంచేసివేస్తారు. ప్రజలను హద్దులోనుంచుటకు వారికి గల రాజకీయశక్తి, వారు ఆందోళన, ప్రచారం చేయడానికి గల హక్కులు వారినుండి తీసివేయబడవలెను. ప్రజలు అధికారాన్ని హస్తగతం చేసుకొని ఉత్పత్తి శక్తులను లాభంకొరకు గాకుండా సంఘమంతటికీ ఉపయోగపడేట్లు మరల నిర్మిస్తారు. అంటే సామ్యవాదాన్ని స్థాపిస్తారన్నమాట. లేదా, కొద్ది సంఖ్యగల అధికారవర్గం దొంగలు, తాగుబోతులు, తెలివితక్కువవారు, క్రూరులు మొదలైనవారి సాయంతో తన బలాన్ని తాత్కాలికంగా ఘట్టి పరచుకొని, ప్రజలను అణగద్రొక్కి, కార్మిక సంఘాలను రూపుమాపి, పౌరసత్వ హక్కులను ధ్వంసంచేసి తన నిరంకుశత్వాన్ని, స్వలాభాన్ని సాగిస్తుంది. ఈ ముఠా ఆశయం పూర్వపు సొంత ఆస్థి విధానాన్ని నిలబెట్టడం, లాభంకొరకు ఉత్పత్తి సాధనాల నుపయోగించడం, తన ఉత్పత్తి నమ్మను తగిన బజార్లను విదేశాలలో సంపాదించడం, దేశంలో కూలీలను, జీవిత వ్యయాన్ని తగ్గించి ఉంచడం, యుద్ధానికి తయారుకావడం. ఈ విధానంలో సామ్యవాద మేదీలేదు. కాకున్న కమ్యూనిస్టులనుండి కొన్ని బాహ్య చిహ్నములను గ్రహించి ఉపయోగించుచున్నది - గొప్ప గొప్ప ప్రదర్శనాలు, యువకోద్యమాలు, సామ్యవాదపరిభాష. కాని సామ్యవాదరాష్ట్రమునకు పునాదియైన "ఉత్పత్తి సాధనాలు ప్రజల సొమ్మయి యుండడం, ఉత్పత్తి ప్రజల జీవిత వ్యయాన్ని హెచ్చించేందుకు నిర్ణయప్రకారం క్రమపద్ధతిని సాగింపబడడం, సంఘంలో ప్రతి వ్యక్తికీ తన మనోభావాన్ని వెల్లడిచేసే హక్కు ఉండేందుకుగాను ప్రజాస్వామ్య పద్ధతిమీద ఎన్నికోబడిన సోవియట్లు" నాజీజంలో నగుపడవు. నాజీజంగాని, ఫాసీజంగాని గుత్త పెట్టుబడిదారి విధానం యొక్క అంతిమ దశయేగాని — క్షీణించి పోవుచున్న పెట్టుబడిదారి విధానంయొక్క శవాకారమేగాని



వేరుగాదు. సోవియట్ గొప్ప చలనచిత్రం — "ఆచార్య మాంమ్‌లక్"ను చూచినవారు నాజీల రకం ఎటువంటిదో జ్ఞాపకానికి తెచ్చుకోవచ్చు. పరులను హింసించడమే ఆనందంగా భావించేవారు, చేతగాని వైద్యులు, మర్యాద లెరుగని కురూపులు (గోయబుల్స్‌వంటివారు), నేరస్థులు, ఉద్రేకంతో పొరబడేవారు, ఏవిధంగానైనా సంఘంలో పైకి రావలయునని ప్రయత్నించేవారు - వీరందరూ నాజీ పార్టీలోనికి ఆహ్వానింప బడ్డారు. హిట్లరు స్వయంగా నియంత కాడు. గొప్ప భూస్వాములు, పరిశ్రమల సొంతదార్లు, డబ్బు వడ్డీకిచ్చే పెట్టుబడిదార్లు కలిసి తమ వర్గనియంతృత్వం బదులు హిట్లరును బొమ్మగా నిలబెట్టారు.

## కమ్యూనిజం

కమ్యూనిస్ట్ అంటే ఎవరు? మన పెట్టుబడిదారి పత్రికల దుష్ప్రచార ఫలితంగా తెలియని ప్రజలు కమ్యూనిస్టు అంటే ఒక పెనుభూతమని అనుకుంటున్నారు. అతడు సోమరిపోతుగా పుట్టిన వ్యక్తికాడు (మన ధనికులవలె). విదేశీయులనుండి లంచాలుపొంది న్యాయపరులైన, తెలివిగల శ్రామికులచే అకారణంగా సమ్మెలు చేయించగల మహా మేధావియైన దేశద్రోహికాడు. ఏది ఎట్లున్నను అతడుమాత్రం దేశప్రేమిగాడు: సహవాసేచ్ఛ గలవాడుగాడు. ప్రతి దేశంలోను కమ్యూనిస్టులలో అతి నేర్పరులు, నిపుణులునైన శ్రామికులును, వైజ్ఞానికులును, ఉపాధ్యాయులును, గ్రంథకర్తలును ఉన్నారు. మొత్తంమీద కమ్యూనిస్టులు మిగతప్రజలకన్న ఎక్కువ ప్రపంచజ్ఞానం కలిగియున్నారు. పత్రికలను చదువుతూంటారు. తమ తీరిక సమయంలో ఎక్కువ భాగాన్ని మార్క్సిజాన్ని అర్థంచేసుకోనూ, సంఘ పరిస్థితులను గ్రహించనూ, వాటిని అభివృద్ధిపరచనూ, కార్మిక సంఘాలకు తోడ్పడనూ, రాజకీయ కార్యాల్లోను గడుపుచున్నారు. కమ్యూనిస్టులలో విశాల సంస్కృతి, చురుకైన తెలివిగలవా రనేకులున్నారు. దృక్పథంలోను, సానుభూతిలోను వారు అంతర్జాతీయ వాదులు. నాజీ పార్టీలోనికి ఆహ్వానింపబడిన దొంగలు, తెలివి తక్కువ వెధవలు మొదలైనవారు కమ్యూనిస్టు పార్టీలోకి అడుగుబెట్టడానికి వీల్లేదు. కమ్యూనిస్టులలో సర్వదా రాజకీయాలలో పాటుబడుచున్నవారు కొద్దిపాటి జీతాలను మాత్రమే పుచ్చుకొంటున్నారు. కాని వారి నడవడి గొప్పదిగా పున్నది - ఉండాలి. ఈ నిబంధన సోవియట్ సంయుక్తరాష్ట్రంలో అతి నిష్క-

ర్షతో అమలునం దుంచబడుచున్నది. కమ్యూనిస్టుకు, నాజీకి గల వ్యత్యాసాన్ని నిరూపించను ఒక చక్కని ఉదాహరణ గలదు. 1933 లో జరిగిన రైష్‌స్టాగ్ దహన విచారణప్పుడు డిమిట్రాఫ్ గోరింగులకు గల వ్యత్యాసం.

ఏ క్షణమందైనా మన పత్రికలు కమ్యూనిస్టు విరుద్ధ ప్రచారాన్ని ప్రారంభింపవచ్చు. కాని మన పత్రికలు ఈ కార్యాన్ని ఆరంభింపకున్న కమ్యూనిజం అంటే ప్రస్తుతం ప్రజలకు గల అపోహ త్వరలోనే అదృశ్యమౌతుంది. సోవియట్లలో యుద్ధానికి పూర్వమున్న పరిస్థితులను చదివి - రోజుకు 7 గంటలు మాత్రమే పని, ఉదారవంతమైన భరణాలు, యుద్ధ పరిశ్రమలనుండి లాభం సంపాదించకూడదన్న నీతి, అతి శక్తివంతమైన విమానదాడి రక్షణ సన్నాహాలు, నిర్ణీత ఆర్థిక విధానం గల సంఘంలో శాంతి సమయంనుంచి యుద్ధపు రోజుల్లోకి ఎంత సులువుగా మారను వీలున్నది - మనలో పలువురు ఆశ్చర్య పడుచున్నారు. సోవియట్ ప్రభుత్వం తన ప్రజలనుండి ఎంత సహకారాన్ని పొందుచున్నది చూచి మనం ఎక్కువ ఆశ్చర్య పడక తప్పదు. సోవియట్ ప్రజలు, ఆబాల గోపాలం, తమ మాతృదేశాన్ని అపార ప్రేమతో, అత్యంత ఉత్సాహంతో, మహా పట్టుదలతో రక్షించుకొనుచున్నారని నాజీలుసైతం ఒప్పుకొంటున్నారు. సోవియట్ చరిత్ర నెరిగినవారి కెవ్వరికీ ఈ విషయాలు ఆశ్చర్యాన్ని కల్గించవు. కాని నిన్నటివరకు బ్రిటిష్ పత్రికలలోని అసత్య ప్రచారాలను నమ్మినవారు ఆశ్చర్య పడక తప్పదు. నిజం, అణచి ఉంచడానికి మహా కష్టమైన వస్తువు. ఎందుచేతనంటే (నిజం) ఒకమారు తప్పించుకున్నదా, తన కథను ప్రపంచమంతట చాటుతుంది. నిజాన్ని అణచి పెట్టినవారిని ఎవ్వరూ నమ్మరు.

# 4. సోవియట్ - బ్రిటిష్ సంబంధాలు

బ్రిటిష్ ప్రజలు, ప్రభుత్వం కూడాను ప్రస్తుతం సోవియట్లపట్ల ముందుకన్నా ఎక్కువ స్నేహభావంతో నున్నారు. అందువలన, రాజకీయ వాదనకోసం పూర్వపు సంబంధాలలోని అసంతృప్తి కరమైన ఘట్టాలను తొవ్వుకోడానికిది సమయంకాదు. కాని, నిజాన్ని చూడకుండా కండ్లుమూసుకున్నంత మాత్రాన సరి



యైన నిర్ణయానికి రాజాలము. పూర్వపు సంబంధాల యందలి సత్యాన్ని ప్రస్తుతం తెలుసుకొని జ్ఞాపక ముంచుకోడానికి బలమైన కారణాలు మూడున్నవి —

(1) ఇంతవరకు బ్రిటను — సోవియట్ల సంబంధాలలోని లోటుపాట్లన్నిటికీ సోవియట్లే కారణమని బ్రిటిష్ పత్రికలు చాటి ఉన్నాయి. నిజంలో ఆ బాధ్యతలో చాలభాగం బ్రిటిష్ అధికారవర్గానికి చెందినదే.

(2) ఏ క్షణంలో నైనా బ్రిటన్‌లోని అభివృద్ధి నిరోధకులు మరల బ్రిటన్ - సోవియట్ సంయుక్తరాష్ట్రాల స్నేహానికి భంగం కల్గించడానికి ప్రయత్నించవచ్చు. అట్టి ప్రయత్నాన్ని అడ్డడానికి మనం జాగరూకులమై వుండాలి.

(3) మనస్ఫూర్తిగా ఈ రెండు దేశాలు పరస్పరం సహాయపడ వలసిన ఈనాడుకూడ అధికారవర్గంలో కొంతభాగం నిరుత్సాహాన్ని చూపించుచున్నది.

## ద్వేషం

1917 నుంచి సోవియట్ సంయుక్తరాష్ట్రింపట్ల బ్రిటిష్ వైఖరి, సాధారణంగా, నిరుత్సాహక రంగాను, కొంతకాలం స్నేహభావంతోను, కొంతకాలం ద్వేషంతోను ఉంటూవచ్చింది. కాని బ్రిటిష్ ప్రజలు కొంతస్నేహ భావాన్ని పూనారుగాని పత్రికల ప్రచారం అపారంగా సోవియట్లకు విరుద్ధంగా సాగింది. సోవియట్ రాష్ట్రం నిలబడగల శక్తిని కలిగియుండలేదనిగూడ బ్రిటిష్ పత్రికలు ప్రచారం చేశాయి. అందువలన సోవియట్లతో స్నేహం కుదుర్చుకొననూ, కొంత సానుభూతి చూపనూ తలచుకున్నను కార్యరూపంగా వీలైందికాదు.

సోవియట్ - బ్రిటిష్ సంబంధాలు చెడ్డరోజులలో ఆరంభమైనవి. 1914-18 యుద్ధం జర్మనీతో ముగియక మునుపే బ్రిటిష్ సైన్యాలు ఇంకను పుట్టుకలోనే ఉన్న సోవియట్లపైకి పంపబడినవి. ఈ విషయాన్నిగురించి "ప్రపంచక్లిష్టత : తదుపరి" అన్న తన గ్రంథంలో (235 పుటలో) చర్చిల్ ఇలా వ్రాశాడు —

"బ్రిటిష్ సైన్యాలు రష్యను భూమిమీద దండయాత్రకు వచ్చినట్లు నిలబడినవి. సోవియట్ ప్రభుత్వ విరోధులకు ఆయుధాలనిచ్చినవి. సోవియట్

రేవులను ముట్టడించినవి. సోవియట్ యుద్ధనావలను ముంచినవి. మన సైన్యాలు సోవియట్ ప్రభుత్వ నాశనాన్ని కోరినవి. అందుకెన్నో ఉపాయాలను పన్నినవి."

బ్రిటిష్ శ్రామికుల చర్యయు, "రష్యాపై చేతులు తీయండి" అన్న ఆందోళన - ఈ రెంటి ఫలితంగా ఈ బహిరంగ యుద్ధప్రయత్నాలు మానివేయ బడినవి. కాని వీటిబదులు సోవియట్లను ధ్వంసం చేయవలయునని కుట్రలు సాగుతునే వచ్చినవి. చాలకాలం సంభాషణలు సాగిన తర్వాత 1921 లో ఒక వ్యాపారపు టొడంబడిక సంతకము చేయబడినది. కాని 1924 వరకు రహస్య రాజకీయ విధానంలో సోవియట్ సంయుక్తరాష్ట్రం బ్రిటన్‌చే గుర్తింపబడలేదు. మొదటి లేబరు ప్రభుత్వం 1924 లో సోవియట్లతో రహస్య రాజకీయ సంబంధాల నారంభించింది. ఈ మధ్యకాలంలో, 1922 లో కానెన్స్‌కు వచ్చిన సోవియట్ రాయబారులకు లాయడ్ జార్జి కొన్ని ఆలోచనల నెరింగించాడు. ఆ ఆలోచనలను సోవియట్ ప్రభుత్వం ఆమోదించియున్న సోవియట్లలోని నూతన ప్రభుత్వానికున్న సామ్యవాద పునాదులు కూలిపోయేవి.

## "ఎర్ర ఉత్తరం", అర్‌కాస్ దాడి

1924 లో "ఎర్ర ఉత్తరం" అన్న పేర ఒక ఉత్తరం ఫోర్జరీ చేయబడింది. ఈ ఉత్తరం రష్యానుంచి వ్రాయబడినట్లునూ, బ్రిటిష్ కార్మికుల పురిగొల్పుటే ఈ ఉత్తరం ఉద్దేశమైనట్లునూ సామ్రాజ్యవాదులు కథలల్లారు. 1927 లో అర్‌కాస్‌ను చుట్టు ముట్టి అచ్చటి సోవియట్ వ్యాపార రాయబార కచ్చేరీని పోలీసులు ప్రవేశించి కనబడిన కాగితాలన్నింటినీ వశపరచుకున్నారు. అంతటితో రెండు దేశాల మధ్య రహస్య రాజకీయ సంబంధాలు తెగిపోయినవి. తర్వాత రెండవ లేబరు ప్రభుత్వం రోజులలో మరల రహస్య రాజకీయ సంబంధాలు ఆరంభమైనవి.

కొంతకాలం పరస్పర ద్వేషం తక్కువగావున్న తర్వాత 1933 లో "మెట్రో - విక్" విచారణవచ్చింది. మాస్కోలో విధ్వంసకచర్యలు చేసిన నేరానికి అనేకమంది నేరస్థులు విచారింప బడ్డారు. అందులో కొందరు ఆంగ్లేయులు



కూడ ఉన్నారు. వీరి నేరం విచారింపబడుచున్నది. ఏదేశంగాని, విదేశీయులు తన సరిహద్దులలో నేరము చేసిన వారిని విచారించి దండించవచ్చునని అంతర్జాతీయ న్యాయశాస్త్రమే ఒప్పుకొనుచున్నది. అట్లుండికూడ, పై విచారణలలో శిక్షింపబడిన బ్రిటిష్ పౌరులను వదలివేయవలసిందని అగౌరవమైన విధంగా బ్రిటన్లో ఆందోళన ప్రారంభమైంది. సోవియట్ సంయుక్తరాష్ట్రం ఈ ఆందోళనకు లొంగలేదు. విచారణలు ఆగలేదు. బ్రిటిష్ ప్రభుత్వం రష్యను దిగుమతి - ఎగుమతులపై నిషేధాన్ని పార్లమేంటులో శాసించింది.

## ఈడెన్ మాస్కోకు వెళ్లుట

1934 లో సోవియట్ సంయుక్తరాష్ట్రం నానాజాతి సమితిలో సభ్యురాలుగా చేరిందని ముందే గమనించాం. 1935 లో బ్రిటిష్ — సోవియట్ సంబంధాలు బాగుపడు సూచన లగుపడినవి. 1935 లో ఈడెన్ మాస్కోకు వెళ్లాడు. ప్రధాన విషయాన్ని ఒక్కటిని స్పష్టపరిచాడు - "అంతర్జాతీయ విధానంలో ప్రధాన సమస్యల గురించి మన రెండుదేశాలకు ఏవిధమైన వైషమ్యమూ లేదు." కాని కొంతకాలం ఈ రెండుదేశాల సంబంధాలలో అభివృద్ధి కనబడిందికాదు. 1936, 1937 లలో రష్యాలోని పంచమ దళాన్ని శిక్షించడంతో బ్రిటిష్ పత్రికలు మరల సోవియట్ విరుద్ధ ప్రచారాన్ని సాగించాయి. స్టాలిన్ వ్యక్తిగతంగా తన నిరంకుశత్వాన్ని స్థిరపరచుకొనను ఈ విచారణలు - శిక్షలు అన్న నాటకాన్ని ఆడించుచున్నాడని ఈ ప్రచారం. నేను స్వయంగా ఈ విచారణలలో కొన్నింటిని చూచి వాటిని గురించి 1936 లో ఒక చిన్న కరపత్రాన్ని ప్రచురించాను. అందుకు మన పత్రికలు నన్ను దూషించినవి. కాని, నిజం నిలకడమీద తెలిసింది. ఆ విచారణలలోని సత్యం నేడు బయట బడింది.

## మ్యూనిక్

1938-1939 క్లిష్టరోజులకు వచ్చాం. 1938 లో ఛేంబర్లేను, దలాదీరు, హిట్లరు, ముస్సోలిని మ్యూనిక్‌లో సమావేశ మయ్యారు. జెకొస్లొవేకియాను కొంతకోసి హిట్లరు కర్పించారు. జెకొస్లొవేకియాతో పరస్పర సహాయ సంధి కుదుర్చుకొనిన సోవియట్ సంయుక్తరాష్ట్రం ఈ సమావేశానికి ఆహ్వానింపబడ

లేదు. ఈ సమావేశ ఫలితాలవల్ల తన బద్ధ విరోధియైన, తనప్రక్క ఇంటనున్న జర్మనీ బలం ఎక్కువైన తనకు ముప్పు తప్పదు గనుక ఆ సమావేశానికి తా నాహ్వానింపబడక పోవడం అవమానింప బడినట్లేనని సోవియట్ సంయుక్త రాష్ట్రం భావించింది. గ్లాస్గో విశ్వవిద్యాలయంలో "ఆధునిక చరిత్ర"కు ఆచార్యులుగా నున్న గవిన్ హెండర్ సన్ గారు ఇటీవల డుమ్ఫ్రీస్ అన్న నగరంలో నిచ్చిన ఉపన్యాసంలోని ఈ క్రింది మాటలు గమనింపదగ్గవి —

> "జర్మనీ సాగించిన సోవియట్ విరుద్ధ ప్రచారంవల్ల జర్మనులకు యూరప్‌లోని ప్రతి దేశంలో మిత్రు లేర్పడ్డారు. నాజీజానికి ఆమూలాగ్రం విరోధులమైన మనంకూడ రష్యా - జర్మను యుద్ధం తప్పదని ఆశపడ్డాం. ఈ ఆశయే మ్యూనిక్‌లో మనం హిట్లరు పాదాల నంటడానికి కారణం."

23-8-1939 న జరిగిన సోవియట్ - జర్మను అనాక్రమణ సంధి, పశ్చిమ యూక్రేను, పశ్చిమ తెల్ల రష్యాలను హిట్లరుకన్నా ముందు సోవియట్లాక్రమించుకోవడం మొదలైన సంఘటనలను బ్రిటిష్ పత్రికలు మిషగా తీసుకొని సోవియట్లను నిందించ నారంభించినవి. బ్రిటన్, సోవియట్ల సంబంధాలు 1939 అంత్యంలో పూర్తిగా క్షీణించినవి.

## ఫిన్లాండు

యుద్ధంలోకి దిగిన అన్ని రాజ్యాలతోను తాటస్థ్య విధానాన్ని నిష్కర్షగా సోవియట్ సంయుక్తరాష్ట్రం అవలంబించ తీర్మానించుకున్నదని మాలటోవ్ ప్రకటించాడు. ఈ ఉపన్యాసంలోనే అప్పట్లో రాయబారాలు సాగుతూ ఉన్న సోవియట్ - ఫిన్లాండు సమస్యలను గురించిగూడ విశదీకరించాడు. అబద్ధప్రచారాలను ఖండించుచు, ఫిన్లాండులో కొన్ని కీలక స్థానాలను కేవలం సోవియట్ల రక్షణార్థం తాము కోరుచున్నారని తమ ఉద్దేశాన్ని స్పష్టపరిచాడు. మాలటోవ్ ఒక్క విషయాన్ని మరిచిపోయాడు. ఈ విషయం ఫిన్లాండు ప్రభుత్వం ప్రచురించిన "బ్లూ బుక్"లో విదితమై వుంది. సోవియట్ - ఫిన్లాండు రాయబారాలు విచ్ఛిన్నమై పోవడానికి కారణం హాంగోను సోవియట్లకు కొంతకాలానికి ఫిన్లాండునుండి కౌలుకు



కోరడమే. సోవియట్ ప్రభుత్వం చివరకు ఈ ప్రపంచ యుద్ధం ముగియువరకు కౌలుకిచ్చిన చాలుననిగూడ ఒప్పుకున్నదని ఫిన్లాండు ప్రభుత్వమే ప్రకటించింది. "యుద్ధం వ్యాపించాలె?" అన్న పుస్తకంలో నేనువ్రాసిన విషయాన్ని సోవియట్ సంయుక్తరాష్ట్రం స్పష్టంగా ఎరుగు —

> "రష్యా, జర్మనీతో యుద్ధంచేయవలసి వచ్చిన మెన్నర్హీం నాయకత్వంకింద ఫిన్లాండు సైన్యం, 1918 లో వలెనే, జర్మను సైన్యాలను ఫిన్లాండునకు ఆహ్వానించుటో, (సోవియట్లను దండెత్తను) లేక, ఫిన్లాండు ఆహ్వానానికెదురుచూడకుండా జర్మను సైన్యాలు రష్యాను దండెత్తను మొదటి యత్నంగా ఫిన్లాండు నాక్రమించుటో - ఈ రెంటిలో నేదో ఒకటి తప్పక జరుగుతుంది" అని.

ఫిన్లాండు — సోవియట్ యుద్ధాన్ని ఇచ్చట వర్ణించక పోవడానికి స్థలాభావమే కారణం. ఫిన్లాండు సైన్యాలను పూర్తిగా ఓడించిన పిదపగూడ సోవియట్ సంయుక్తరాష్ట్రం ఉపపాదించిన షరతులు ఎంతో ఉదారంగా నున్నవి. గెలుపొందిన ఏ రాజ్యంగాని తాను ఓడించిన దేశానికి ముందెన్నడూ ఇంత ఉదారమైన షరతులను ఉపపాదించి యుండలేదు. సోవియట్ సంయుక్తరాష్ట్రం అప్పుడే గనక ఫిన్లాండులో ఎక్కువ సౌకర్యాలను కోరియున్న ఈ యుద్ధంలో తన కెంతో లాభంగా నుండేది. ఫిన్లాండును పరిపూర్తిగా ఓడించుటకు ముందు సోవియట్ సంయుక్తరాష్ట్రం బ్రిటిష్ మధ్యవర్తిత్వానికి ఒప్పుకున్నది. సోవియట్ సంయుక్త రాష్ట్రానికి విరుద్ధంగా, ఫిన్లాండుకు సాయపడను బ్రిటన్ - ఫ్రాన్స్‌లు తమ సైన్యాలను ఫిన్లాండుకు పంప ప్రయత్నించడం ఎంత బుద్ధితక్కువో ఇప్పుడు స్పష్టమౌతున్నది. బ్రిటిషు - ఫ్రెంచి సేనలు ఫిన్లాండుకు బయలుదేరకముందే ఏదో ఒక విధంగా సోవియట్లు రాజీచేసుకోడం మన అదృష్ట మనాలి.

## సర్ స్టాఫర్డ్ క్రిప్స్ సాయపడ్డాడు

ఫిన్లాండు యుద్ధంతో బ్రిటన్ - సోవియట్ల సంబంధాలు ఆగిపోయినవి. మాస్కోలోని మన రాయబారి సెలవుమీద ఇంటికి వచ్చాడు. మరల వెళ్ళే సూచనలేవీ అగపడలేదు. మనకూ సోవియట్లకూ ఇంతవరకు కొద్దిగానైనా జరుగుతూవున్న

వ్యాపారం అసలు అడుగంటింది. నార్వే, బెల్జియం, హాలెండులు ఓడిపోయిన తర్వాత, ఛేంబర్లేను ప్రభుత్వం కూలినతర్వాత సర్ స్టాఫర్డ్ క్రిప్స్ మాస్కోకు రాయబారిగా వెళ్తానని ముందుకు వచ్చాడు. ఈతనికన్నా మేలైన వ్యక్తి లేడీపనికి. ఈతడు తెలివిగల సామ్యవాది. సదా, సోవియట్లతో స్నేహాన్ని కోరినవాడు. ఈతడు మాస్కో చేరిన తర్వాతకూడ ఈ రెండు దేశాల సంబంధాలలో అభివృద్ధి ఏమీ కనబడలేదు. 1940 ఆగస్టులో ఒక ఉపన్యాసంలో మాలటోవ్ ఇంతకన్నా ఎక్కువ చెప్పలేక పోయాడు - "సర్ స్టాఫర్డ్ క్రిప్సును సోవియట్ సంయుక్త రాష్ట్రానికి రాయబారిగా నియమించడం సోవియట్ సంయుక్తరాష్ట్రంతో తన సంబంధాల నభివృద్ధి పరచాలెనన్న బ్రిటిషు కోర్కెను తెలియజేస్తుంది." కాని, నిజంలో బాల్టిక్ రాష్ట్రాలు సోవియట్ సంయుక్తరాష్ట్రంలో చేరడంవల్ల ఏర్పడిన చిన్న సమస్యలనైనా - లండన్‌లో ఆపివేయబడ్డ బాల్టిక్ రాష్ట్రాల బంగారం, బ్రిటిషు రేవులలో ఆపివేయబడ్డ బాల్టిక్ ఓడలు, తమ మాతృదేశానికి మరలిపోవాలని కోరిన బాల్టిక్ నావికులను బ్రిటనులో ఆపి ఉంచడం - బ్రిటిషు ప్రభుత్వం స్నేహభావంతో పరిష్కరింప దలచుకున్నట్లు లేదు. జర్మనీకి కోపం వచ్చిననూ అనుమానించక డాన్యూబ్ కమీషన్ సమావేశాల్లో సోవియట్ సంయుక్తరాష్ట్రం పాల్గొన్నది. అందుకు బ్రిటను స్పష్టంగా, బహిరంగంగా నిందించింది. మరలి క్లిష్ట పరిస్థితు లేర్పడ్డవి. ఈ యుద్ధాన్ని త్వరలో ముగించను ఏకైక మార్గం సోవియట్ సంయుక్త రాష్ట్రంతో బ్రిటను స్నేహంచేసుకోవడమేనని మేము అనేకులం నమ్మాము.

## మధ్య వేసవి వెలుగు

అఖరుకు 22-6-1941 ఉదయం నాజీలు సోవియట్ సంయుక్తరాష్ట్రాన్ని దండెత్తారు. సోవియట్ - బ్రిటిష్ సంబంధాలు తప్పకుండా వెంటనే అభివృద్ధినైనా చెందాలి, లేదా పూర్తిగా రూపుమాసి పోవాలి. వేరు మార్గం లేదు. ఆ రోజు సాయంకాలం రేడియో మూలంగా చర్చిల్ చేసిన ప్రకటన, జూన్ 24 న కామన్స్ సభలో ఈడెన్ ఉపన్యాసం, జూలై 12 న మాస్కోలో జరిగిన ఒడంబడికల ఫలితంగా సోవియట్ — బ్రిటన్ సంబంధాలు అభివృద్ధి చెందినవి. ప్రస్తుతం ఈ రెండు దేశాల సఖ్యతా ఆశల గొల్పుచున్నది. కాని ఏ నిమిషమం



దైనా ఈ స్నేహం విచ్ఛిన్నం కావచ్చు. ఈ విషయాన్ని విశదంగా 6 వ అధ్యాయంలో చర్చించాను.

# 5. యుద్ధంపట్ల సోవియట్ల వైఖరి

ఈ అధ్యాయంలో సోవియట్ రాష్ట్రం, సోవియట్ ప్రజలు సాధారణంగా యుద్ధాలను ఎలా పాటిస్తున్నారో, ఈ యుద్ధాన్ని ఏ దృష్టితో చూస్తున్నారో గమనించవలసియుంది. 2 వ అధ్యాయంలో ఈ విషయాన్ని కొద్దిగా చర్చించాను. సోవియట్ ప్రజలను బ్రిటిషు ప్రజలు అర్థంచేసుకోడానికని వ్రాసిన ఇటువంటి పుస్తకంలో యుద్ధంపట్ల వారి వైఖరిని విశదీకరించడం అవసరం.

సోవియట్ పౌరులు, తెలివిగల మానవులందరివలెనే, యుద్ధాన్ని అసహ్యించుకుంటున్నారు. శాంతిని కోరుచున్నారు.

## లెనిన్ వివరణ

యుద్ధంపట్ల సోవియట్ ప్రజల భావాలు శాంతివాదుల భావాలుకావు. వారు కొన్ని యుద్ధాలు, ఆ యుద్ధాలో సామ్యవాదరాష్ట్రమేదీ చేరకయున్నా, ఒకవైపు "న్యాయ యుద్ధాలు"గా నుండవచ్చునని నమ్ముచున్నారు. ఈ భావాలను 1915 లో లెనిన్ ఈ క్రిందిమాటలలో ప్రకటించాడు —

> "సామ్యవాదులమైన మేము ప్రజల మధ్య యుద్ధాలు పశువుల కార్యమనీ, అమానుషమనీ, సదా ఖండించుతూనే వున్నాము. కాని యుద్ధంపట్ల మా వైఖరి అరాచకవాదులు, బూర్జువా శాంతివాదులు అవలంబించుచున్న దృష్టికాదు. శాంతివాదుల అభిప్రాయాలకూ మా అభిప్రాయాలకూ తేడా ఉండడానికి కారణం యుద్ధాలకు, ఒక దేశంలోని వర్గ కలహాలకు గల విడివడనిసంబంధాలను మేము గ్రహిస్తున్నాము. వర్గాలను రూపుమాపి సామ్యవాదాన్ని సృష్టించనిది యుద్ధాలను రూపుమాపడం అసాధ్యమని మే మెరుగుదుము. అందుకై అంతర్యుద్ధాలు - అనగా అణగద్రొక్కబడిన వర్గం, అణగద్రొక్కుచున్న వర్గంపైకి; బానిసలు తమ సొంతదార్లపైకి;

రైతులు జమీందార్లపైకి; శ్రామికులు ధనికవర్గం పైకి తిరుగబడడం - ఆత్యవసరమనీ, న్యాయమనీ, అభివృద్ధిదాయకమనీ గుర్తిస్తున్నాం. మార్క్సిస్టులమైన మేము శాంతివాదులు, అరాజకవాదులవలెగాక ప్రతి యుద్ధాన్ని, దానివరకు, మార్క్సుయొక్కగతి తార్కిక భౌతిక దృష్టితో చారిత్రాత్మకంగా అర్థంచేసుకోవాలని అంటున్నాం. చరిత్రలో అనేక యుద్ధాలు - ప్రతి యుద్ధానికి స్వభావమైన రాక్షసత్వాన్ని, దుఃఖాన్ని, హింసను భీతిని కలిగియున్నా - అభివృద్ధి స్వభావాన్ని కలిగియుండినవి. అంటే, ఆ యుద్ధాలు అతి హానికరమైన అభివృద్ధి నిరోధక సంస్థలను నాశనం చేయడంలో సాయపడి మానవాభివృద్ధికి తోడ్పడినవి. నిరంకుశత్వం, కులీన పద్ధతి ఈవిధంగానే రూపుమాపబడినవి. యూరప్‌లో అత్యంత అమానుషమైన నిరంకుశత్వాన్ని నాశనం చేయను తోడ్పడినవి - ముఖ్యంగా టర్కీ, రష్యాలలోని నిరంకుశ పరిపాలనను.

"అట్టి యుద్ధాలు జరిగినప్పుడు విప్లవకారులు, ప్రజాస్వామ్యవాదులు, సామ్యవాదులందరూ నిరంకుశత్వాన్నీ, జమీందారి విధానాన్నీ లేక విదేశ ప్రజల హింసించుతూన్న తమదేశ అధికారవర్గాన్నీ నాశనంచేయను సహాయపడిన బూర్జువా వర్గానికి సానుభూతి సదా చూపారు............

"'స్వయంరక్షణ'కై యుద్ధమని అందలి న్యాయాన్ని సామ్యవాదులు గుర్తించినప్పుడు పై ఆశయాలే వారి మనసులం దుండినవి........ 'స్వయం రక్షణ' యుద్ధంలో సామ్యవాదులు పై ప్రత్యేక అర్థంలో 'న్యాయ యుద్ధముందని గ్రహించారు........ఈ అర్థంలో మాత్రమే సామ్యవాదులు 'మాతృభూమి రక్షణ', 'స్వయంరక్షణ' యుద్ధాలను బలపరచడం న్యాయమనీ, అభివృద్ధికి కారణభూతమనీ, ధర్మమనీ గుర్తిస్తున్నారు - ప్రస్తుతం తప్పక గుర్తించారు."

## "న్యాయ" యుద్ధాలు — "అన్యాయ" యుద్ధాలు

ఈ భావాలు కలిగియున్న సోవియట్ ప్రజలు 1914—18 లో జరిగిన ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధం కేవలం ప్రష్యన్ సైనిక బల ఫలితమని గాని,



ప్రస్తుత యుద్ధం (1939 — ?) హిట్లరుయొక్క దురాశ ఫలితమనిగాని అనుకోరు. యుద్ధాలు హెచ్చుగా ముడివస్తువుల కొరకో, బజార్లకొరకో (జపాన్ మంచూరియా నాక్రమించినట్లు) లేక, విశాలదృష్టితో చూచిన ప్రపంచాన్ని, వలసరాజ్యాలను మరల పంచుకోడానికో (1914-18 యుద్ధంలాగా) సాగింపబడుచున్నవి. ప్రతి యుద్ధంలోను అనేక సమస్యలు మిశితమై యుంటవి గనుక యుద్ధాలు "న్యాయ" మైనవి లేక "అన్యాయ" మైనవి అని నిర్ణయించడానికి సూత్రమొక టున్నది. ఏ యుద్ధంగాని తన సైనిక చర్యల మూలంగా అభివృద్ధికి పాటుబడే శక్తులకు దోహద మిచ్చిన అది "న్యాయ" యుద్ధం అవుతుంది. అభివృద్ధికి అడ్డపడు సైనిక ప్రయత్నాలన్నీ "అన్యాయ" యుద్ధము లగును. 1914-1940 మధ్యకాలంలో జరిగిన 50 పై చిల్లర యుద్ధాలను సోవియట్ ప్రజలు విమర్శించి ఒక్కొక్క యుద్ధం పట్ల తమ అభిప్రాయాలను స్థిరపరుచుకున్నారు. ప్రపంచంలో తమదేశ మొక్కటియే సామ్యవాద రాష్ట్రం గనుక ఏ క్షణంలోనైనా పెట్టుబడిదారి ప్రపంచం తమ దేశాన్ని దండెత్తవచ్చునని ఎరిగి వారు యుద్ధాల స్వభావాలను చక్కగా అవగాహన చేసుకొని వీలైనంతవరకు తమ దేశం యుద్ధంలోకి దిగకుండా ఉండడానికి, యుద్ధం తప్పనిసరి అయిన, వీలైనంతవరకు, తామాలసించడానికి ప్రయత్నించారు.

1939 వేసవిలో బ్రిటన్, ఫ్రాన్స్‌లకు తమతో సంధి కుదిరియుండి తర్వాత గూడ జర్మనీ యుద్ధాన్ని ప్రారంభించియున్న ఆ యుద్ధాన్ని సోవియట్ ప్రజలు "న్యాయయుద్ధం" అనేవారు. ఎందువల్ల ? ఈ మూడు రాజ్యాలకు కుదిరే సంధి ఫ్రాన్స్, బ్రిటన్లలోని ప్రజాశక్తి ఫలితమే గనుక: ప్రజాశక్తిని బలపరుచును గనుక అది "న్యాయయుద్ధం" అగును. ఈ రాయబారాలు విఫలమైనందువ ఫ్రాన్స్, బ్రిటన్లలో అభివృద్ధి విరోధిక శక్తులు జయము పొందినట్లు స్పష్టమైంది. అందువలననే 1939 సెప్టెంబరు 3 వ తారీకున ప్రారంభమైన యుద్ధాన్ని సోవియట్ ప్రజలు "ప్రపంచాన్ని మరల పంచడానికొరకు జరుగుచున్న సామ్రాజ్యవాద యుద్ధం" అని అన్నారు. 31—10—1939 న మాలటోవ్ అన్నట్లు "ప్రస్తుతం బ్రిటన్, ఫ్రాన్సులు జర్మనీతో చేస్తున్న యుద్ధానికి పునాది ఫ్రాన్సు, బ్రిటన్ల వలస రాజ్యాలను జర్మనీ కోరుతుందన్న భయమే." బ్రిటన్, ఫ్రాన్సుల్లోని అభివృద్ధి నిరోధకులు ఏవిధంగానైనా జర్మనీ - సోవియట్ సంయుక్తరాష్ట్రాలకు యుద్ధం

రావాలని కోరుచున్నారని సోవియట్ ప్రజలు అనుమానించారు. ఈ అనుమానాలను యుద్ధం ఆరంభమైన వెంటనే జరిగిన సంఘటనలు స్థిరపరచినవి. ఈ విషయాన్ని విశదంగా "యుద్ధం వ్యాపించాలె", అన్న గ్రంథంలో వ్రాశాను.

### యుద్ధ ఆకారం మారింది

1941 జూన్‌లో హిట్లరు అకారణంగా సోవియట్లను దండెత్తగానే చర్చిల్, ఈడెన్లేగాక రూజువెల్ట్ అధ్యక్షుడుగూడ దండెత్తబడిన దేశానికి అండయై నిలుస్తానన్నాడు. కేవలం తామీ యుద్ధంలోకి లాగబడినంత మాత్రాన గాక బ్రిటిష్, అమెరికను ప్రభుత్వాలు సామ్యవాద రాష్ట్రానికి సహాయపడ పూనుకున్నవి గనుక ఈ యుద్ధ స్వభావం మారిందని సోవియట్ ప్రజలు గుర్తించారు. 3–7–1941 న స్టాలిన్ తన ప్రఖ్యాత ఉపన్యాసంలో నుడివినట్లు —

> "మనం పితృదేశ స్వాతంత్ర్యంకోసం చేస్తూన్న యుద్ధం యూరప్, అమెరికా ప్రజల ప్రత్యేక స్వాతంత్ర్య సమరంలో లీనమైంది. స్వాతంత్ర్యం కొరకు నిలబడు ప్రజల ఐక్య సంఘటన ఏర్పడింది. ఈ ఐక్యత, హిట్లరు ఫాసిస్టు సైన్యాలు ప్రపంచ మానవకోటిని భానిసల చేయాలని చేయు ప్రయత్నాల నెదిరి నిలిచి యున్నది. ఈ సందర్భంలో బ్రిటిష్ ప్రధాని చేసిన చారిత్రాత్మకమైన ప్రకటన....అమెరికను సంయుక్తరాష్ట్ర ప్రభుత్వ ప్రకటన (ఆ రెండు దేశాలు మనదేశానికి సహాయపడ సిద్ధంగా వున్నవని) పూర్తిగా తెలియదగిన సూచనలు."

## 6. బ్రిటిష్ చర్యలు – ప్రతీకారములు

యుద్ధం సోవియట్ సంయుక్తరాష్ట్రానికి వ్యాపించడంవల్ల ప్రస్తుత యుద్ధంలోను, రానున్న శాంతిలోను మార్పుకలుగబోతున్నది. గనుక ఈ యుద్ధం సోవియట్లకు వ్యాపించడం బ్రిటను ప్రజలకు అతి ప్రధానవిషయం. ప్రస్తుతం యుద్ధం మన మీదికన్నా హెచ్చుగా సోవియట్ ప్రజల మీదికి విరుచుకొని పడుచున్నా మన భవిష్యత్తు, సోవియట్ ప్రజల భవిష్యత్తువలెనే, అపాయస్థితిలో వున్నది.



మార్పుచెందిన ప్రస్తుత పరిస్థితులను బ్రిటిష్ ప్రజలలోని అనేక శాఖలు ఏవిధంగా భావించుచున్నవని గ్రహించడం మన కార్యసాధనకు, తీర్మానాలకు సహాయపడును. మనం అర్థంచేసుకోవలసిన ముఠాలు ముఖ్యంగా మూడున్నవి.

### సామాన్య మానవుని తలంపులు

మొదటి ముఠా సాధారణంగా రాజకీయాలను గురించి ఆలోచించని జనబాహుళ్యం. ప్రజలలో ఎక్కువ భాగం వీరే. ఈ ముఠా ఎక్కువ శక్తివంతమైంది. ఇందుకు కారణం వీరు బహు సంఖ్యాకులుగా నుండడం. ఏదో ఒక నమ్మకానికి వచ్చినప్పుడు వీరు తమ ఉద్దేశాలు క్రమేణా ఆచరణలోనికి వచ్చేటట్లు చేయగలరు. వీరు సాధారణంగా రాజకీయాల్లో అభిరుచి లేనివారు గనుక వాదన మూలంగా వీరిని ఏదో ఒక వైపుకు లాగవచ్చు. వీరు తమ మనస్సులను దృఢపరచుకొని తమ నిర్ణయాలు ఆచరణలోకి రావాలని పట్టు పట్టకున్న వీరు తమ భవిష్యత్తునైనా తీర్మానించలేరు, ఇందుకు తార్కాణం 1914 నుంచి ఈ యుద్ధారంభంవరకు జరిగిన బ్రిటిష్ రాజకీయాలే.

రెండవ ముఠా సోవియట్ సంయుక్తరాష్ట్రంతో ఈ దేశం స్నేహంకలిగి ఉండాలని ఎల్లప్పుడూ కోరుతూవచ్చిన అతివాదులది. వీరి సంఖ్య స్వల్పమైంది కాదు. కాని ఇంతని లెక్కించ సాధ్యంకాదు. వీరి ఉత్సాహం, కార్యదీక్ష కారణంగా వీరిసంఖ్య కుండవలసిన పలుకుబడికన్నను మించిన పలుకుబడి వీరికున్నది. వీరు క్రమేణా మొదటి ముఠాలోని అనేకమందిని తమ అభిప్రాయాలకు మార్చగల్గుచున్నారు. గనుక వీరి ఆలోచనల ననుసరించి భవిష్యత్తు రూపందాల్చవచ్చు. కాని, మూడవ ముఠాకు చెందిన అభివృద్ధి నిరోధకులు వార్తాపత్రికలపైన, ప్రచార శాఖలమీద, ప్రభుత్వంతో తమకుగల అపరిమితమైన పలుకుబడిని ఉపయోగించి వీలైనంతవరకు మితవాదులు ముందుకు సాగకుండా, అతివాదులతో కలియకుండా, అడ్డుపడుచున్నారు.

### అభివృద్ధి నిరోధకులవలని అపాయాలు

ఈ మూడవముఠా ద్రవ్య, పారిశ్రామిక, జమీందారీ తరగతులలోని అభివృద్ధి నిరోధకులలో గణన కెక్కిన వారితో నిండియున్నది. ఈ ముఠాచేతుల్లోనే

వేటికి బ్రిటన్లోని అధికారముంది. ఈ ముఠా లండన్ నగరంలో అధిక బలాన్ని కల్గియుంది. బ్రిటిషు పరిశ్రమల ఫెడరేషను, టోరీ పార్టీ మొదలైన సంస్థలలో ఈ ముఠా పాతుకొని పోయియున్నది. లేబర్పార్టీలోని మితవాదులు తమపార్టీలోని అతివాదులకు కమ్యూనిస్టులతో గల పాత పోట్లాటలను నెపంజేసుకొని సోవియట్ సంయుక్తరాష్ట్రాన్ని ద్వేషిస్తున్నారు. వీరిలో కొందరు పై చెప్పబడిన మూడవ ముఠాకు (అభివృద్ధి నిరోధకులకు) అండగా వున్నారు.

మొదటి ముఠా అయిన ప్రజాబాహుళ్యానికి రాజకీయాల్లో చొప్పిడి లేకున్నను హిట్లరు, అతని నాజీలు నాశనంచేయ బడాలని దృఢవిశ్వాసంవున్నది. అందుకు సాయపడే మిత్రరాజ్యం కొత్తగా దొరికేటప్పటికి వారు హర్షించారు. పోనుపోను ఈ ఆనందం ప్రేమగాను, కృతజ్ఞతగాను మారవచ్చు. సోవియట్ రాష్ట్రాన్ని గురించి వారు ఆశ్చర్య పోవుచున్నారు. ఇంతవరకు వారు సోవియట్లను గురించి తమ పత్రికలలో ఏ వేవో వింత కథలను చదివారు. కాని సోవియట్లు పారిశ్రామికంగా అభివృద్ధి నొందిన దేశమని, హిట్లరును విమానాలతో, టాంకులతో, యంత్రసాయంతో ఎదుర్కొనుచున్నదని విన్నతర్వాత సోవియట్లపట్ల వారు సానుభూతిని చూపించుచున్నారు. సోవియట్ యుద్ధవార్తలలోని సత్యాన్ని గ్రహించిన తర్వాత ఈ సానుభూతి ప్రేమగా మారింది.

సోవియట్ రాష్ట్రాన్ని, సోవియట్ ప్రజలను బ్రిటిష్ ప్రజాబాహుళ్యం చక్కగా అర్థం చేసుకున్న తత్ఫలితంగా యుద్ధంలో, రానున్న శాంతి స్థాపనలో గలిగే మార్పులను నొక్కి చెప్పవలసిన అవుసరంలేదు. 25 ఏండ్లుగా అతివాదులు సోవియట్ సంయుక్తరాష్ట్రాన్ని గురించి ప్రచారం సాగించకుండా ఉన్న ఈ యుద్ధసమయంలోనైనా ప్రజా బాహుళ్యంలో హటాత్తుగా సోవియట్ల పట్ల సానుభూతి ఏర్పడేదిగాదు. బ్రిటిష్ అతివాదుల కృషి ప్రశంసింప తగ్గది.

## అతివాదులు ధృఢంగా నిలిచి వున్నారు

రెండవ ముఠాకు చెందినవారు (అతివాదులు) మార్పుచెందవలసిన అవసరం లేదు. ఇప్పటికి 25 ఏండ్లుగా సోవియట్ సంయుక్తరాష్ట్రాన్ని ప్రపంచానికి ఆశా



జ్యోతిగాను, సామ్యవాద ఫలితంగాను, తమ ఆశయాలకు ప్రతి బింబంగాను భావించారు. తమ ప్రజలకు వచ్చినట్లే సోవియట్ ప్రజలకుగూడ యుద్ధంవచ్చినందుకు వారు చింతించుచున్నారు. ఈ యుద్ధ ఫలితంగా నిర్మాణకార్యక్రమం తాత్కాలికంగా ఆగిపోవలసి వచ్చినందుకు వారు చింతించుతూన్నారు. "స్వాతంత్ర్యాన్నికి పోరాడుచున్న ప్రజల ఐక్య సంఘటన"లో తాము, సోవియట్ సంయుక్త రాష్ట్రంతో చేరియున్నందుకు వారు ఆనందిస్తూన్నారు. శాంతి సమావేశంలో సోవియట్ సంయుక్తరాష్ట్రం ఉండడం ఎంతో మేలుచేస్తుందని, మరల 1917 లో వలెనే ఆక్రమణలు, నష్టపరిహారాలు, అవమానాలు, క్రోధాలు - వీటన్నిటికి విరుద్ధంగా సోవియట్లు నిలువబడునని నమ్ముచున్నారు. శాంతిని సంపాదించను ఈ దేశం మనస్ఫూర్తిగా తనశక్తినంతను యుద్ధప్రయత్నంలో వినియోగించవలయునని కోరుచున్నారు. సోవియట్ సంయుక్తరాష్ట్రానికి సర్వవిధముల ఈ దేశం సహాయం చేయాలని కోరుచున్నారు. మూడవ ముఠాను నమ్మకపోవడమేగాక మొదటి ముఠాలో కొందరును, తమలోగూడ కొందరును నిశ్చింతగా కూర్చొని అంతా కష్టం సోవియట్లే చేసేస్థితిని కల్గిస్తారేమోనని దిగులుపడుచున్నారు. సామ్యవాద రాష్ట్రం భవిష్యత్తు, ప్రపంచమంతటి భవిష్యత్తు, తామరాకుమీది నీటిబొట్టువలె నిలకడలేని ఈ రోజుల్లో మానవులందరూ తమ సర్వ శక్తినీ వినియోగించెదరని నమ్ముచున్నారు.

## నాజీ విరుద్ధమా ? లేక, సామ్యవాద విరుద్ధమా ?

మూడవ ముఠాసంగతి ఏమిటి? ఈ దేశంలో పేరుకు ప్రజాస్వామ్యమున్నది. అధికారమంతయుగూడ ఈ ముఠా చేతులలో నున్నది. ప్రస్తుతం ఈ ముఠా అంతా సోవియట్లకు విరుద్ధంగా లేదు. ఇప్పుడు ఈ ముఠాలో చీలిక ఏర్పడినది. ఈ ముఠాలో ఒక భాగం నాజీజం, ఫాసీజం మానవకోటికి బద్ధ విరోధులనీ, వాటిని నాశనం చేయడమే తమ ప్రధమ కర్తవ్యమనీ, ఈ ప్రయత్న ఫలితంగా తమదేశంలో సామ్యవాదం బలపడినను ఫరవాలేదనీ, సామ్యవాద రాష్ట్రం ఈ ప్రయత్నంలో తమతో నిలవడం అదృష్టమనీ భావించుచున్నది. మరో భాగంలో హెచ్చుమంది, ఇటలీ అబిసీనియాను దండెత్తినప్పుడు "నాగరికతను వ్యాపింప చేయడం" అని ఇటలీని సమర్థించినవారు; ఫ్రాంకోను "ధైర్యముగల

క్రైస్తవ పెద్దమనిషి" అని పొగడినవారు; మ్యూనిక్ సంధికి దారితీయను రన్సిమన్ ప్రభువును జెకొస్లొవేకియాకు పంపమన్నవారు; ఫిన్లాండు సమస్యపై సోవియట్ సంయుక్తరాష్ట్రంమీద యుద్ధం ప్రకటించమని ఆందోళచేసినవారు. వీరు ప్రస్తుతం హిట్లరంటే వణకుచున్నా ఫాసీజానికి విరోధులుగారు. ఈ భాగం సామ్యవాదం ముందుకు సాగకుండా ఆపడానికి ఎట్టి త్యాగాన్ని చేయడానికైనా సిద్ధముగా వుంది. అవకాశం దొరకగానే నాజీలతో సంధిచేసుకోడానికి సిద్ధంగావుంది. ఈ భాగానికి మిత్రులుకూడా ఉన్నారు - వీరు నాజీజానికి, సామ్యవాదానికి రెంటికి కూడ విరోధులు. ఈ మిత్రులు జర్మనీ, సోవియట్ సంయుక్తరాష్ట్రం ఒకటి వొకటి నాశనం చేసుకున్న చాలునని ప్రార్థిస్తున్నారు.

ఒక్క ప్రధానవిషయం మనకు ఉత్సాహాన్ని కల్గిస్తుంది. మూడవ ముఠాలో నాజీ విరుద్ధ భాగం ఇంతవరకు జయించింది. చర్చిల్, ఈడెన్, రూజవెల్ట్ అధ్యక్షుడు చేసిన ప్రకటనలు మనకందరికి ఎంత ఆనందాన్ని కల్గించినవో, అంత దుఃఖాన్ని సోవియట్లపై ద్వేషంగలవారికి కల్గించినవి, ప్రస్తుత పరిస్థితులను మన దేశం ఎట్లుపయోగించుకోవలయునన్న విషయాన్ని సులభంగా గ్రహించవచ్చు. సోవియట్ ద్వేషులు బలంగలవారు. వీరిని ఎదుర్కోడానికి మనం ప్రభుత్వానికి అండగా నిలవ్వాలి. ప్రభుత్వంలోగాని, ప్రభుత్వానికి సమీపంలోగాని, సివిల్ సర్విస్‌లోగాని, ఇతర ఉద్యోగాలలోగాని సోవియట్ ద్వేషులుంటే వారిని వెంటనే తొలగించమని మనం ఆందోళన నారంభించాలి. సోవియట్ సంయుక్తరాష్ట్రంతో ఆర్థిక, రాజకీయ, సైనిక, సాంఘిక, సంస్కృతిక రంగాలలో మైత్రి కుదుర్చుకొని, స్నేహం, సహకారం, పరస్పరం అర్థంచేసుకొనుట మూలంగా మనం అభివృద్ధి శక్తులను బలపరచ ప్రయత్నించాలి.

### రాదగిన అపాయాలు

చరిత్రలో తరచు గొప్ప మార్పులు జరిగే కాలంలో మనం ప్రస్తుతం ఉన్నామని గుర్తించాలి. అభివృద్ధి నిరోధకులగుంపు ఈవాళ ఊరుకోవచ్చు. రేపు అతి చురుకుగా పనిచేయవచ్చు. వారిని ఎదుర్కోడానికి ఈవాళ అత్యంత ఉపయోగకారియైన ఆ యుధం రేపు నిరుపయోగం కావచ్చు. జర్మనీ సోవియట్లను



ఓడించ గల్గితే వీరు ఏ ఉపాయాల పన్నుతారో, లేక సోవియట్లు జర్మనీని ఓడించ గల్గి, యూరప్‌లోని దేశాల్లో విప్లవాలు ప్రారంభమైనప్పుడు వీరే కుట్రలల్లుతారో ఇప్పుడూహించడం కష్టం. ఇప్పటి కప్పుడే మనదేశానికి, సోవియట్ సంయుక్త రాష్ట్రానికి మైత్రి పొసగకుండా చేయుటకు వారు గోరిల్లా, యుద్ధాన్ని ప్రారంభించారు. అందువలననే మన రెండుదేశాల మధ్య సహకారం అనుకున్నంతగా సాగడం లేదు. ఇందులో వారట్టే జయంపొందక పోవచ్చుగాని విదేశకార్యాలయంలో వారికి పలుకుబడి ఉన్నది. తద్వారా బి. బి. సి. లోను, ప్రచారశాఖ కార్యాలయంలోను వారు తమ విషజ్వాలలను వ్యాపింప చేయగలరు. అందుకు తగినట్లు మనం జాగరూకులమై యుండవలెను.

## 7. సోవియట్ సంయుక్తరాష్ట్ర బలం

ఇంతవరకు బ్రిటిష్ ప్రజలు సోవియట్ సంయుక్తరాష్ట్రాన్ని గురించి ఎరిగిన దంతయు అంతగా నిజంకాదు గనుక ఈ పుస్తకం చిన్నదైనను ఇందులో సోవియట్లదేశం, ఆ దేశప్రజలను గురించి క్లుప్తంగా వివరింపకున్న పుస్తకం పూర్తినొందదు.

### సోవియట్ సంయుక్తరాష్ట్రం ఏమిటి?

సోవియట్ సంయుక్తరాష్ట్రం ప్రపంచంలో మహా పెద్ద దేశం. దానంత పెద్దదేశం మరేదీ లేదు. భూభాగంలో 6 వ వంతు ఆ దేశమైవుంది. దాని విస్తీర్ణం 80,00,000. చదరపు మైళ్ళ కెక్కువగా వుంటుంది. ఆర్కిటిక్ మహా సముద్రంలో కొన్ని ద్వీపులుగాక ఆ దేశమంతయూ, ఏవిధమైన చీలికలేని, ఒకే ఒక భూభాగంగా వుంది. 1-1-1939 న జరిగిన జనాభా లెఖ్ఖల ప్రకారం దాని జనసంఖ్య 17,00,00,000. 1939-40 లో కొన్ని దేశాలు కొత్తగా సోవియట్లను చేరినందుననూ, ఈ మూడేండ్ల జనాభా పెరిగినందుననూ ప్రస్తుతం అచటి ప్రజల సంఖ్య 19,30,00,000. ఆ దేశంయొక్క సహజ సంపత్తి అపారం. తెలిసినంత వరకు భూగర్భంలోని చమురు బుగ్గలు మొత్తం 1939 లో 870,00,00,000

టన్నులు. జారులకాలంలో ఈ మొత్తం 90,00,000 టన్నులు మాత్రమే. నేల బొగ్గు ఆధారాలు మొత్తం 165,40,00,000 టన్నులు. అమెరికా పిదప నేల బొగ్గు ఆధారాల్లో సోవియట్లదే ప్రపంచంలో అగ్రస్థానం. ప్రపంచంలోని తదితర దేశాలన్నిటికంటెను హెచ్చు నీటిశక్తి ఆధారాలను కలిగియున్నది. ఎరువులక్కు పనికివచ్చు లోహములను, మాంగనీసు, తదితర ముడి లోహములను ఇతర దేశములకన్న ఎక్కువగా కలిగివుంది. బంగారు దొరకు ఆధారములు అతి సమృద్ధిగా వున్నవి. టేకు అడవులు లక్షలాది మైళ్ళకు వ్యాపించి వున్నవి. ప్రపంచపు కాగితపు పరిశ్రమకు అన్ని ఆధారము లడుగంటినను, సైబీరియాలోని అరణ్యముల నుండి, ప్రపంచమంతటికి సరఫరా చేయగల ఆధారములక్కడ వున్నవి. ప్రపంచపు గోధుమ ఉత్పత్తిలో నాలవభాగం, రేయ్ ఉత్పత్తిలో ఇంచుమించు సగభాగం, ఓటుధాన్యంలో నాలవ భాగాన్ని సోవియట్లు ఉత్పత్తి చేయుచున్నవి. అచ్చట వ్యవసాయం గొప్పెత్తున సాగింపబడడమే గాక యంత్రసాయంతో సాగింపబడుచున్నది. వ్యవసాయానికి నీటి సరఫరా అపారంగా పెరిగినందుననూ, గోధుమ మొదలైన పంటలకు చీడ బట్టకుండా శాస్త్రజ్ఞానాన్ని ఉపయోగించుతున్నందుననూ నేడు అచ్చటి వ్యవసాయ ఫలితాలు 1913 కు రెండింతలైనవి. 1937 లో కాయధాన్యాల పంట 10,83,00,000. మెట్రిక్ టన్నులకును, 1938 లో 8,55,00,000. మెట్రిక్ టన్నులకును, 1939 లో 10,65,00,000. మెట్రిక్ టన్నులకును 1940 లో 11,20,00,000. మెట్రిక్ టన్నులకును హెచ్చింది.

జారుల కాలంలో రష్యా అతి బీద వ్యావసాయిక దేశంగా నుండేది. యంత్ర సామగ్రి, కొనుగోలు వస్తువులు, భోగవస్తువులు కొద్దిమంది ప్రభువుల కోసం దిగుమతి చేయబడడానికి గోధుమ మొదలైన ధాన్యాన్ని ఎగుమతి చేసేవారు. రైతులు పస్తుండేవారు. నేడు, పంచవర్ష ప్రణాళికల పుణ్యాన సోవియట్ సంయుక్తరాష్ట్రం ప్రపంచంలోని సుప్రసిద్ధ పారిశ్రామిక దేశాల్లో ఒకటిగా వున్నది. ఇతర దేశాలమీద ఆధారపడవలసిన అవసరంలేదు. అచ్చటి వస్తూత్పత్తి పరిశ్రమలనేకం - యంత్రోత్పత్తి, ట్రాక్టర్లు, మోటారుకార్లు, విమానాలు, వంటలుకోసే యంత్రాలు, రసాయన పరిశ్రమలు మొదలైనవి - కేవలం నూతనంగా ప్రారంభింపబడినవే. 1937 లో ఆ దేశంయొక్క పరిశ్రమల ఉత్పత్తిలో 80% పైగా



ప్రథమ, ద్వితీయ పంచవర్షప్రణాళిక లప్పుడు నిర్మింపబడిన పరిశ్రమలలో ఉత్పత్తి అయినది, 1930 తదనంతరం ప్రపంచ ఆర్థిక క్లిష్టతలో ఇతర దేశాల ఉత్పత్తి అపారంగా క్షీణించినప్పుడు ఆ దేశం ఉత్పత్తి మినుమిక్కిలిగా పెరిగింది. పరిశ్రమల ఉత్పత్తి 1929 తో పోల్చిన 1938 లో 477% కు పెరిగినది. ఆ సంవత్సరాల్లోనే మిగత ప్రపంచమంతటి ఉత్పత్తి 91% కు తగ్గింది. 1940 లో సోవియట్ల ఉత్పత్తి వాటి 1929 ఉత్పత్తితో పోల్చిన 534% కు హెచ్చినది. అదే సమయంలో అమెరికా ఉత్పత్తి 111% కు మాత్రమే అభివృద్ధి చెందినది. 1940 అంత్యంలో ప్రతిరోజూ సగటున ఉత్పత్తి అయిన (సోవియట్ల) దుక్కు ఇనుము 47,000. టన్నులును; ఉక్కు 59,000. టన్నులును; నేల బొగ్గు 4,67,000, టన్నులును. చమురు, చమురు - వాయువు 98,000. టన్నులును.

## చక్కగా వ్యాపించిన పరిశ్రమలు

ఈ పారిశ్రామికాభివృద్ధి కేవలం ఆధునికం మాత్రమే గాదు. ఆరంభం నుంచి ఈ పరిశ్రమలు, భూగోళరీత్యా, అన్ని ప్రాంతాలకూ వ్యాపించినవి. ఇందుకు కారణం ఒక్క దేశ రక్షణ దృష్టిమాత్రమేగాదు. సోవియట్ సంయుక్తరాష్ట్రంలో నివసించుచున్న అనేక జాతుల ప్రజలందరికీ తగిన, స్థిరమైన జీవనాధారాన్ని కల్గించవలయునన్న ఉద్దేశమే ఇందుకు కారణం. ఒక్క ఉదాహరణను గమనిద్దాం. ఓల్గానది, ఉరల్స్ పర్వతాలకు నడుమనున్న "రెండవ బాకు" యుద్ధానికి పూర్వం చమురు ఉత్పత్తిలో 10% తాను ఉత్పత్తి చేసింది. ప్రస్తుతపు అవసరాలకు పోగా సాలీనా మిగులు చమురులో 75% యుద్ధకాలపు దాపుదుగా సోవియట్ సంయుక్తరాష్ట్రమందంతటా పంచబడి, దాచిపెట్టబడియున్నది. ముడి ఇనుము ఉత్పత్తిలో 60% ఉరల్స్‌లో ఉత్పత్తియగుచున్నది. నేల బొగ్గు ఉరల్స్‌లోను, కాజకిస్థాన్ లోను, సైబీరియాలోను ఉత్పత్తి యగుచున్నది. కాజకస్థాన్ రాగి, మరికొన్ని లోహములను; ఖిర్గీజియా రాగినీ; మంగోలియాలోని ఆల్టెయ్ ప్రాంతం రాగి, తుత్తినాగం, సీసం, వెండి, తగరం, నికెల్ మొదలైన లోహములను; సైబీరియా బక్సైటును, మరికొన్ని లోహములను ఉత్పత్తి చేయుచున్నవి. కాకసస్, యూక్రేన్ ప్రాంతాల్లో విరోధినుంచి అపాయం హెచ్చుగా నున్నచోట్ల మాంగనీస్ ఉత్పత్తి యగుచున్నది. మాంగనీస్ను

ప్రపంచంలోని ఏ ఇతర దేశమున కంటెను తానే ఎక్కువ ఉత్పత్తి చేయుచున్నది. తనకు కావలసిన నికెల్‌లో 20% మాత్రమే తాను ఉత్పత్తి చేయుచున్నది. ఈ లోహాన్ని సోవియట్ సంయుక్తరాష్ట్రానికి కనడా సరఫరా చేయగలదు.

## ఆ దేశ ప్రజలు

సోవియట్ సంయుక్తరాష్ట్రంలోవున్న ఆధారాలలో అత్యంత విలువమైంది అచ్చటి మానవకోటి. "ప్రపంచంలోనెల్ల అత్యంత విలువయైన మూలధనంలో అమూల్యమైంది, నికరమైందిన్నీ ప్రజా సమూహం" అని ఒక గొప్ప ఉపన్యాసంలో స్టాలిన్ అన్నాడు. సోవియట్ సంయుక్తరాష్ట్రి ప్రజలు అనేక జాతులకూ, భాషలకూ, శాఖలకూ చెందినవారు. విప్లవానికి పూర్వం రష్యను జాతికి చెందనివారు — వీరు మొత్తం జనాభాలో సగముంటారు — రష్యనులకన్నా అతి నీచంగా చూడబడేవారు. అన్నిజాతుల ప్రజలలో హెచ్చుమంది అతి నికృష్ట జీవితాన్ని గడుపుతూ వచ్చారు. విప్లవానంతరం అన్ని జాతులవారూ కష్ట - సుఖాల్లో సమాన భాగస్వాములైనారు. నూతన ప్రపంచాన్ని, మానవకోటికంతకు, కష్టజీవులందరికి ఆనందాన్నీ, సుఖాన్నీ సమకూర్చగల ప్రపంచాన్ని సృష్టించను అందురు సమానంగా కష్టపడుచున్నారు. సోవియట్ సంయుక్తరాష్ట్రిలో ప్రతి స్త్రీ, పురుషుడూ తన శక్తులను పూర్తిగా అభివృద్ధి చేయడానికి సర్వ అవకాశాలున్నాయి. పెట్టుబడిదారి దేశాలలో 100 కి 80 మంది ప్రజలు, ధనికవర్గం అన్న దౌర్జన్యంవలన ఎలాంటి అవకాశాలు లేక కృశించి పోవుచున్నారు. ఈ విషయాన్ని స్పష్టపరుస్తూ 8—7—1941 న "సన్‌డె ఎక్స్‌ప్రెస్" పత్రికలో ప్రచురింపబడిన ఈ క్రింది వాక్యాలు గమనింప దగినవి —

"ఆ దేశం (సోవియట్ సంయుక్తరాష్ట్రం). మనదేశంలో మనం నెత్తిన పెట్టుకునే నాయకు లనేకులచే ద్వేషింప బడుచున్న దేశం. మనకంటెను హెచ్చు నేర్పరితనం, సామర్థ్యం కలిగియుండడానికి కారణమేమిటి? రష్యాలో సమర్థత గలవారికి అడ్డంనిలిచే "పాఠశాల పరిచయాలు"గాని, నాయకత్వం వహించగల శక్తి, మేధస్సు కేవలం ఒక్క చిన్నవర్గం



సొంతమనే బుద్ధితక్కువ అభిప్రాయాలుగాని లేకపోవడమే కారణంగావచ్చు. స్త్రీ పురుషు లందరికి, వారు ఏ పడకపై పుట్టారనీ, లేక ఏ పాఠశాలలో చదివారనీ యోచించకుండా, తగిన అవకాశాలను కల్గించిన ప్రస్తుతం కంటెను కాస్త హెచ్చు సామర్థ్యంతోను, ఎక్కువ నమ్మకంతోను ముందుకు సాగగలం."

ప్రపంచంలో ఏ ఇతర దేశం, ఎన్నడూ 100 ఏండ్లలోపున సాధించియుండని మహత్తర ఫలితాలను 20 ఏండ్లలో సాధించగల ప్రజలు తమ పితృదేశ రక్షణార్థం తమ సర్వస్వాన్ని, ప్రాణాలను అర్పించడంలో ఆశ్చర్యమేమున్నది!

వారి నూతన సామ్యవాద నాగరికతలో వారికి దృఢవిశ్వాసం వున్నది. ఆ నాగరికతను రక్షించను వారు సాగించవలసిన పోరాటం, వెలుతురు - చీకటుల మధ్యగల పోరాటంగా వారు భావిస్తున్నారు. వారి నూతన విధానం వారికెంత విలువగలిగిందో స్పష్టపరుచుటకు "మాస్కో న్యూస్" అన్న అంగ్ల పత్రిక, 1941 మేడే సంచికనుండి ఈ క్రింది మాటల నుదహరించుచున్నాను —

"సోవియట్ సంయుక్తరాష్ట్రంలో నిరుద్యోగం లేదు.

సోవియట్ సంయుక్తరాష్ట్రంలో ఆర్థిక దుస్థితి లేదు.

ప్రతి సోవియట్ పౌరుడును పనిచేయడానికి హక్కు కలిగి యున్నాడు.

ప్రతి సోవియట్ పౌరుడు విద్యను పొందడానికి హక్కు కలిగి యున్నాడు.

ప్రతి సోవియట్ పౌరుడు విశ్రాంతి, విరామాలకు హక్కు కలిగి యున్నాడు.

ప్రతి సోవియట్ పౌరుడు వృద్ధాప్యంలో, జబ్బు చేసినప్పుడు, పని చేయలేని స్థితి ఏర్పడినప్పుడు భరణం పొందడానికి హక్కు కగిలి యున్నాడు.

ప్రతి సోవియట్ పౌరుడు ఉచిత వైద్య సేవను పొందడానికి హక్కు కలిగి యున్నాడు.

ప్రతి సోవియట్ స్త్రీ. పురుషునితోపాటు ఆర్థిక, రాష్ట్ర, సంస్కృతిక, సాంఘిక, రాజకీయ జీవితాల్లో సమాన హక్కులను కలిగివుంది.

జాతి, కుల భేదం లేకుండా సోవియట్ సంయుక్తరాష్ట్ర ప్రజలందరూ అన్ని విషయాల్లోను - ఆర్థిక, రాష్ట్ర, సంస్కృతిక, సాంఘిక, రాజకీయ జీవితాల్లో సమానులు."

## సైనిక ఆశలు

పాఠకులు అనేకమంది, మిగత విషయము లన్నిటికన్నను. ఈ యుద్ధంలో (జర్మను - సోవియట్) ఎవరు గెలుస్తారని తెలుసుకొనుటకు ఎక్కువ ఆతుర్దా పడుట సహజం. సైనిక విషయాలను గురించి చెప్పుటకు నేనా విషయాలనంతగా ఎరిగినవాణ్నికాను. అందువలను పాఠకులకు మాక్స్ వెర్నర్ రచించిన "నానా దేశాల మిలిటరి బలం", "ప్రపంచంకొరకు యుద్ధం"; మేజర్ హోపర్ వ్రాసిన "సోవియట్ - ఫిన్లాండు యుద్ధం"; ఇవర్ మాంటాగు రచించిన "ఎర్రసైన్యం - 50 ప్రశ్నలకు జవాబు" అన్న రచనలనుచూడమని సలహా.

## నైతిక బలం - సమర్థత

ఆధునిక యుద్ధాల్లో జయం నైతిక బలంమీదను (సైనికుల, పౌరుల). పారిశ్రామిక బలంమీదను, సైనిక సంసిద్ధత - సమర్థతల మీదను ఆధారపడి ఉంటుంది. ఈ విషయా లన్నిటిలోనూ సోవియట్లు ఉన్నతస్థితిలో నున్నవని ధైర్యపడడానికి తగిన ఋజువు లున్నవి. నైతిక బలం విషయంలో తమ ప్రాణాల వర్పించి అయినా సరే తమదేశాన్ని రక్షించను సోవియట్ పౌరు లెందువలన సిద్ధంగా నున్నారని ముందే గమనించాము. ఎర్రసైన్యం రాజకీయ పరిజ్ఞానాన్ని కల్గివుంది గమకనూ, తానెందుకు పోరాడుచున్నదీ ఎరుగుమ గనుకనూ నైతిక బలంలో సోవియట్ ప్రజలకు తీసిపోదు. పారిశ్రామిక బలాన్నిగురించి ముందే



గమనించాము. ఈ యుద్ధ సమయంలోగాని, ఇంతకు ముందు శాంతి సమయంలో గాని సోవియట్లు దిగుమతులమీద ఆధారపడి యుండలేదు. వారికి కావలసిన వస్తు సామగ్రి అంతా వారి దేశంలోనే లభించుతూంది - ఉత్పత్తి ఔతూంది.

## అపారమైన రక్షణ ఖర్చు

సోవియట్ ప్రభుత్వం, ప్రజలుగూడ కొన్ని ఏండ్లుగా ఈ యుద్ధానికి సంసిద్ధులగుతూనే యున్నారు. అందువలననే తమ జాతీయ ఉత్పత్తి శక్తిలో హెచ్చుభాగం క్రమేణా రక్షణకై వెచ్చించుతూ వచ్చారు. 1933 లో దేశరక్షణకై ఖర్చుచేసిన మొత్తానికన్న 1934 లో మూడింతలు ఎక్కువ ఖర్చుచేశారు. 1935 లో 1934 కు రెండింతలునూ; 1936 లో 1935 కు రెండింతలునూ; 1937 లో 1936 కు 150%ను వెచ్చించారు. 1939 లో రక్షణ ఖర్చు 1937 కు రెండింతలు. 1940 లో ఈ ఖర్చు 1939 తో పోల్చిన 150% హెచ్చింది. 1941 మొత్తం 1940 కన్నా 130% పెరిగింది. 1941 లోని ఖర్చు 1936 ఖర్చుకు తొమ్మిదింతలు. మనం జ్ఞాపకముంచుకోవలసిన ముఖ్యవిషయ మొకటుంది. ఇతర దేశాల్లో ఆయుధోత్పత్తి నుండిగూడ ధనికవర్గం కావలసినంత లాభం సంపాదించుతూంది. సోవియట్ సంయుక్త రాష్ట్రంలో దమ్మిడీ లాభం సంపాదించడానికి వీల్లేదు. సైనిక సమర్థత విషయంలో సోవియట్ ప్రజ లెవ్వరికీ తీసిపోరని మన మెరుగుదుము. ఆధునిక యుద్ధవిధానంలోని అనేక విషయాలను వారే ముందు ఆచరణలోకి తెచ్చింది - పారచూట్ దళాలు, టాంకులు - విమానాలు ఒక్కమారు వందలసంఖ్యలో దాడి సాగించడం మొదలైనవి. వారు కొత్త సంగతులను గ్రహించడంలోను, కొత్త పరిస్థితులకు తగినట్లు తమ ప్రయత్నాలను అలవరచుకోడంలోను అతి నేర్పరులు. ఎర్రసైన్యం ఎక్కువ యంత్ర సహాయంతో పనిచేస్తూన్నది.

ఇంతటి బలిష్ఠంపన్నమైన దేశం, ఇంతకాలంనుంచి యుద్ధానికి సంసిద్ధంగానున్న ప్రజలు తమ వినూత్న నాగరికతను రక్షించుకోడానికి తగిన కారణాలు. అవసరమైన బలం ఉన్నవి గనుక ఈ యుద్ధాన్ని సోవియట్లు గెలవక తప్పదు. ఈ పరీక్షలో వారు ఓడిపోయినా అది ఒక విచిత్ర సంఘటన అనే అనాలి.

# 8. పాఠాలు - హెచ్చరికలు

పైన వివరింప బడిన కథనుండి అన్ని తరగతుల బ్రిటిష్ ప్రజలు గ్రహించ వలసిన పాఠాలున్నాయి - ఆశల గొల్పేవి, అపాయాల సూచించేవి గూడను. ఈ పాఠాలు కేవలం మనం పోరాడుచున్న ఈ యుద్ధానికి సంబంధించినవి మాత్రమే గావు. ఈ యుద్ధానంతరం మనం స్థాపించవలసివున్న శాంతికి కూడ సంబంధించి వున్నవి. మన ప్రయత్నాలను కుంటుబడ జేసి, మన నెత్తి బరువును గూడ ఇతరుల తలపైకి త్రోయగూడదని మనం మనస్సునం దుంచుకోవాలి. ఇదే ముఖ్యమైన పాఠం. సోవియట్ సంయుక్తరాష్ట్రం రూపాన మనకొక గొప్ప సహాయం దొరికిందని ఊరుకోరాదు. ఈ యుద్ధంలో విజయం సంపాదించను మనకంటెను ఎక్కువగా కష్టపడుచున్న పై పోటీదారు (సో. సం. రాష్ట్రం) ఏర్పడినదన్న దృష్టితో మనం కష్టపడాలి.

## జాతీయ ఐక్యత

ఇంతకు పూర్వానికన్నను ఎక్కువ విశాలమైన, నిర్మలమైన జాతీయ ఐక్యతను స్థాపించను ఇప్పుడు గొప్ప అవకాశం దొరికినదన్న పాఠాన్ని మనం మరువ కూడదు. ఈ ఐక్యతలో. ప్రస్తుతానికి, పైన చెప్పబడిన మూడు వర్గములు కలయ వచ్చును. అతివాదులు ఫాసీజానికి బద్ధవిరోధులు. నాజీ జర్మనీని ప్రస్తుతపు బ్రిటిష్ పరిపాలనా వర్గం అధికారంలో నుండగానే జయించిన ఫాసీజం బ్రిటన్‌లోనే వ్యాపింప వచ్చునన్న భయం అతివాదులకుంటూ వచ్చింది. కానీ యుద్ధం సోవియట్లకు వ్యాపించిన తర్వాత అట్టి భయానికి అవకాశం లేదు. మూడవ అధ్యాయంలో విశదీకరింప బడినట్లు, క్షీణించిపోవుచున్న పెట్టుబడిదారి విధానాన్ని నిలపెట్టవలెనని ప్రయత్నించడమే తప్పక ఫాసీజంలోకి దింపుతుంది. కాని ఈ అపాయం ఇక ముందు లేదనే అనాలి. ఈ భయం పోయింది గనుక మన దేశంలోని మితవాదులు, మన ప్రభుత్వం, చర్చిల్, ఈడెన్‌ల ప్రకటనలకు, 12-7-1941 న జరిగిన "మాస్కో ఒడంబడిక"కు, తోడ్పడినంత కాలం దానికి సహకారం చేయాలి. మనం సోవియట్లను బలపరచి తద్వారా తూర్పు యూరప్‌లో



నాజీ సైన్యాలను చెండాడుచున్న ప్రయత్నానికి తోడ్పడగల కార్యదీక్షతలో ఫాసీజాన్ని నిర్మూలించే ఆశలు ఉన్నవని మన ప్రజలందరూ గుర్తించాలి.

## అభివృద్ధి నిరోధకులను గమనించండి

అభివృద్ధి నిరోధకులలో అగ్రగామియైన వర్గం సామ్యవాదాన్ని, సోవియట్లను ద్వేషించుతూన్నది గనుకనూ, సామ్యవాదానికన్ననూ ఫాసీజమే మేలని నమ్ముతూంది గనుకనూ, అవకాశం దొరకగనే నాజీలతో సంధిచేసుకోను ప్రయత్నించునన్న అపాయాన్ని మనం మరచిపోగూడదు. సామ్యవాదంపట్ల వారికిగల భయంకారణంగా, నాజీ జర్మనీతో మనం చేస్తూన్న ఈ యుద్ధంలో సోవియట్ సంయుక్తరాష్ట్రంతో మనకుగల మైత్రిని రూపుమాపి ఏదో ఒక విధంగా నాజీలతో సంధిచేసుకొని తమ అధికారాన్ని, ఆస్తులను పూర్వంలాగా కాపాడుకో ప్రయత్నించిన అతిక్లిష్ట పరిస్థితులు ఏర్పడవచ్చు. అట్టి ప్రయత్నము జరిగిన ప్రజా బాహుళ్యం, చర్చిల్, ఈడెను, వారి అనుచరులూ మనకు సాయపడవచ్చునని అతివాదులం ఆసించవచ్చును - విశ్వసింపవచ్చునుగూడ. మనం జాగరూకతతో నున్న ఈ అపాయం కలిగినను దీనినిగూడ జయించగలుగుదుము.

## శ్శాంతి స్థాపన సమస్యలు

మనం నేర్చుకోవలసిన ఇతర పాఠాలనేకమున్నవి. పైన చర్చించిన వానికన్నను అవి తక్కువ ప్రధానమైనవిగావు. కాని అవి ప్రస్తుతానికి సంబంధించినవి కావు. యుద్ధమున కన్నను హెచ్చుగా శాంతి స్థాపనకు సంబంధించిన సమస్యలవి. అందులో కొన్ని ఆశల కల్గించునవి - మరికొన్ని హెచ్చరికలనిచ్చునవి. ఆశల నిచ్చేవానిలో నొకటి, శాంతి స్థాపనలో సోవియట్ సంయుక్తరాష్ట్రం భాగస్వామిగా నున్నది గనుక, వర్సైలీస్ సంధివలె, రానున్న శాంతిస్థాపన అవమానపరచడం, నాశనం చేయడం, కసి తీర్చుకోడం, నష్టపరిహారాల చెల్లించమనడం మొదలైన అమానుష చర్యలకు దిగదని మనం దృఢంగా నమ్మవచ్చుననేది. అందువలన శాశ్వత శాంతిని స్థాపించు "శాంతి ఆశయాలు" మాత్రమే అమలు లోనికి రావచ్చునని మనం విశ్వసించవచ్చు. బ్రిటన్‌లో ప్రస్తుతం కలిగిన కొత్తమార్పు, గడచిన

## సోవియట్ సంయుక్త రాష్ట్రం - దాని మిత్రరాజ్యాలు.

[illegible] ప్రపంచాన్ని [illegible] రాజ్యాల [illegible]. [illegible] - [illegible]. ఆర్థిక స్వరూపము మొదలైన సమస్య తమ వేటిని పరిష్కరించుట లేదని మనం జ్ఞప్తియందుంచుకోవాలి. పెద్ద [illegible] సమస్యలలో ముఖ్యమైనది ఇదే. కాని మనం ఇప్పుడిప్పుడే దానిని ఎదుర్కొంటున్నాము.




Printed for the Cultural Book[illegible] Buildings, [illegible]
[illegible] by [illegible] Press, [illegible] Street, MADRAS. [illegible]



రచయిత

డి. యన్. ప్రిట్ 1887 లో [illegible]. [illegible]గ్లాండు, జర్మని, స్పెయిన్, స్విట్జర్లాండు దేశాల్లో [illegible]దారు. 1909 లో న్యాయవాదిగా జీవితాన్నారంభించారు. పార్లమెంటులో శ్రామికుల తరఫున సభ్యుడుగా మన్నారు. సోవియట్ సంయుక్తరాష్ట్రంతో మైత్రిపొందను ఇంగ్లండులో నేర్పడిన సంస్కృతి సంబంధాల సంఘానికి అధ్యక్షులు. [illegible] సెప్టెంబరులో లండన్ నగరంలో జరిగిన "రెయిక్‌స్టాగ్" దహన విచారణకు అధ్యక్షులుగూడాను. 1938 లో రష్యా కెళ్ళొచ్చారు. 1936 లో మాస్కో విచారణలప్పుడు అప్పటినుండి తమ అనుభవాన్ని చిన్నపుస్తకంగా - "జినోవైవ్ విచారణ" - ప్రచురించారు. కుటుంబజీవి: ఒక కొడుకు, ఇద్దరు కుమార్తె ఉన్నారు. వీరి యితర రచనలు - "మాస్కోపై వెలుతురు," "ఈ యుద్ధం వ్యాపించాలా?," "ఫెడరల్ అపోహ," "ఫ్రెంచి ప్రజా[illegible]." వీరి కడపటి రచనను "ఫ్రాన్స్ పతనం" అన్న [illegible] ప్రచురించి యున్నాం.

# మా ఏజన్సీ షరతులు

1. మా గ్రంథమండలికి సభ్యులు లేరు. అవసరమైనప్పుడల్లా మా ప్రచురణలను మొత్తంగా తెప్పించుకొని అమ్మేవారే మా యేజంట్లు. ఏజంట్లు డిపాజిట్ కట్ట నవసరంలేదు.

2. ప్రతి ఆర్డరుకు 25% కమీషను ఇవ్వగలం. రైలుపార్సెలుద్వారా మాత్రమే పుస్తకము లంపబడును. గనుక రైల్వే రసీదును పంపను రిజిష్టరు ఖర్చులు, పార్సెలు ఖర్చులు ఏజంట్లే భరించాలి.

3. కమీషను పోగా తడవకు కనీసం రూ. 10-0-0 విలువగల పుస్తకములను తెప్పించుకోవాలి. అనగా రూ. 13-0-0 ఖరీదుచేసే పుస్తకాలకు ఆర్డరివ్వాలి.

4. ప్రతి ఆర్డరులోను ఏ రకానికి ఎన్ని కాపీలు కావాలన్నా పంపగలము.

5. పైకం ముందుగా మనియార్డరుద్వారా పూర్తి మొత్తం పంపాలి. లేకున్న పుస్తకములు పంపలేము. పోస్టల్ ఆర్డర్స్ పుచ్చుకోము. బాంక్ చెక్కులు పంపేవారు వాటిని రొఖ్ఖం చేసుకోను అయ్యే కమీషను ఖర్చునుగూడా పంపాలి. చెక్కులన్నీ గ్రంధమండలి పేరగాక "వి. జి. రెడ్డి" పేర పంపాలి.

6. ఏజంట్లకు మా నూతన ప్రచురణల గురించి ముందుగా తెలియజేస్తాం. ఇతరులు రిప్లైకార్డు వ్రాసినగాని ప్రత్యుత్తర మివ్వలేము.

7. ఉత్తర ప్రత్యుత్తరములన్నీ "మేనేజరు," సంస్కృతి గ్రంధమండలి, పెరంబూరు పోస్టు, మద్రాసు—జరపాలి.

8. వి. పి. పి. ద్వారా ఒకటి రెండు కాపీలు తెప్పించుకోదలచినవారు పోస్టు ఖర్చు లెక్కువయినవి గనుక నల్వురు కలసి మొత్తంగా తెప్పించుకోడం చౌక. వి. పి. పి. ద్వారా పుస్తకము లంపము గనుక ముందే మొత్తం విలువను మనియార్డరుద్వారా పంపాలి.

# నేటి జపాన్

—*—

రచన: కొత్తపల్లి సుబ్బరామయ్య

సంస్కృతి ప్రచురణ—3 * వెల ఎనిమిదణాలు.

✦ ""80 ఏండ్లనాడు అనామికంగానున్న దేశం నేడు ప్రపంచంలోని గొప్పసామ్రాజ్యాలు రెంటిని—బ్రిటను, అమెరికా—ఒక్కపెట్టున ఎదుర్కొని కొంతవరకు హిందూమహాసముద్రం (పసిఫిక్?) లోని దీవులలో యీ రెండుదేశాలకు నిలువనీడలేకుండా చేయగల్గిందంటే యీ దేశప్రభావమేంటో, యీ ప్రజలస్వభావమేంటో తెలుసుకోవలసిన అవసరాన్నిగుర్తించి ఈ గ్రంథం వ్రాయబడింది.

"జపాన్ చరిత్ర, పరిపాలనావిధానం, సంఘజీవనం, ఆర్థికవిధానం, ముమ్ముందు—అని అయిదుపరిచ్ఛేదాలక్రింద ఈ గ్రంథం విభజించబడింది. సుమారు 120 పుటలలో వీలయినంత సమగ్రచిత్రాన్ని పాఠకులముందు ఉంచడంలో రచయిత కృతకృత్యులైనట్లు చెప్పాలి.

"ఇట్టి గ్రంథాలప్రచురణవల్ల సంస్కృతిగ్రంథమండలివారు ప్రజలలో రాజకీయవిజ్ఞానాన్ని వికసింపచేయడానికి మిక్కిలి తోడ్పడినవారవుతున్నారు."

"ఆంధ్రప్రభ" 14—6—42.

✦ "జపాన్నుగురించి ఆంధ్రంలో రెండుమూడుపుస్తకాలు వున్నవిగాని యీనాటికి పనికి వచ్చేది యీ రచన ఒక్కటే అనాలి గ్రంథాన్ని చరిత్ర, పరిపాలనావిధానం, సంఘజీవనం, ఆర్థికవిధానం, ముమ్ముందు అనేకప్రకరణాలక్రింద విభజించారు. పైనపేర్కొన్న కొద్ది ప్రకరణములలోను జపానుయొక్క సమగ్రస్వరూపాన్ని యిమడ్చారు. జపాను ఇండియాను సమీపించిన ఈ సమయంలో ఆంధ్రులు ఈగ్రంథాన్ని చదవాలి."

"ప్రజాబంధు' 21—6—42.

# సోవియట్ రష్యా

రచన: జవహర్‌లాల్ నెహ్రూ.

అనువాదం: పండితారాధ్యుల నాగేశ్వరరావు.

సంస్కృతి ప్రచురణ—4  వెల పన్నెండణాలు.

✦ "1927 లో సోవియట్‌రష్యాలో జరిగిన దశవార్షికోత్సవాలను తిలకించివచ్చి జవహర్ పండితుడు రష్యానుగురించి ఒక గ్రంథం వ్రాశాడు. 16 ఏండ్లనాటి సోవియట్ రష్యా పరిస్థితి ఇందు చక్కగా వివరింపబడింది. నాగేశ్వరరావుగారి అనువాదం కేవలము అనువాదంవలె గాక స్వతంత్రరచనలా సాగింది."  "ప్రజామిత్ర" 16—5—43.

✦ "పండిత జవహర్‌లాల్‌నెహ్రూ 1927 లో రష్యా సందర్శించితిరిగివచ్చినతరువాత వ్రాసిన గ్రంథం ఇది. ఆనాటి సోవియట్‌రష్యాను తాను ఎలా చూడగల్గాడో జవహర్ ఈ పుస్తకంలో పొందుపరచాడు.

జవహర్ చూచిననాటి సోవియట్ రష్యాకన్నా నేటి సోవియట్‌రష్యా ఎంతో అభివృద్ధి పొందినదని గ్రహించడానికి ఈ పుస్తకం చాలా ఉపయోగిస్తుంది. సోవియట్‌స్త్రీలు, సోవియట్ చెరసాలలు, శిక్షాస్మృతి. సోవియట్‌కర్షకులు మున్నగు విషయములగురించి వ్రాసిన (నెహ్రూ) "రష్యా-ఇండియా" అనే ప్రకరణలో పోలికలు, వ్యత్యాసాల ఆధారంతో చిన్న విమర్శ చేశాడు. ఈ చిన్నప్రకరణము రాజకీయవాదులకు కొన్ని సామరస్యములచూపుతూ యోచనకు అవకాశం యిస్తుంది."  "ప్రజాబంధు" 23—5—43.

✦ "సోవియట్ రష్యాపేరు యీ యుద్ధంమూలంగా దేశీయులకు పరిచితమయింది. ఐతే అనేకులకు ఆ దేశపరిస్థితులు, ప్రజల నిత్యజీవనవిశేషాలు, ప్రభుత్వవిధానం. వ్యవసాయపు రీతులు —యివి తెలియనేతెలియవు.

పండిత జవహర్‌లాల్‌నెహ్రూ రష్యావెళ్లి, అక్కడి పరిస్థితులన్నీ స్వయంగాచూసి విస్మితుడైనాడు. ఈ గ్రంథంలో రష్యానుగురించి తేటతెల్లంగా వ్రాశాడు. అటువంటి ఉద్గ్రంథాన్ని శ్రీ నాగేశ్వరరావుగారు తెలుగులో తర్జుమాచేసి ఒక గొప్పలోటు తీర్చారు.

ఈ పుస్తకం ఆంధ్రులు తప్పక చదివితీరాలి. యుద్ధంలో మహాద్భుతశౌర్య, సాహసాలు ప్రకటించి నాజీనియంతను ప్రతిఘటిస్తున్న ఒక గొప్పజాతిలక్షణాలను, పరిపాలనవిధానాన్ని, జీవితపురీతుల్నీ అన్నిటినీ తెలుసుకోవడం అవసరం.

శైలి ఆకర్షకంగా ఉంది. అనువాదంలాగాక స్వతంత్రరచనవలె చదివినంతసేపూ ఉత్సాహోద్రేకాన్ని కలిగిస్తున్నది."  "కథాంజలి" 1—7—43.

WRAPPER PAGE PRINTED ... N. K. PRESS, MADRAS

